# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-66

మే-జూన్ 2014

మూలం: http://kottapalli.in/2014/06/welcome

**ఏపని- ఎవరిది:**
ప్రచురణ: కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి
నిర్వహణ: సత్య ఫౌండేషన్, చెన్నూరు.
ప్రధాన సంపాదకులు: నారాయణ
సహ సంపాదకత్వం: మంజునాథ్
చిత్రాలు: వీరాంజనేయులు, అడవి రాముడు
సాంకేతిక సహకారం: ఆనంద్, లక్ష్మి
వాణిజ్యం: మల్లికార్జున
గౌరవ సలహాదారు: సుబ్బరాజు
అక్షర కూర్పు: కొత్తపల్లి
అలంకరణ: యాక్‌తూ ఫైన్ ఆర్ట్స్ స్టుడియో, హైదరాబాదు. ఫోను: 04042206233
ముద్రణ: ముద్రికా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ ఫోను: 08662579129

స్వాగతం!
కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.
పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్నీ, బొమ్మల్నీ సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చువేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం!



**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | 30 రూ. |
| **12 ప్రతులు** (పోస్టేజితో సహా) | **300** రూ. | 350 రూ. |

రానున్న 12 ప్రతులకోసం డబ్బుల్ని మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించి మీ చిరునామాను పోస్టు/యస్సెమ్మెస్/ఇ-మెయిలు ద్వారా తెలియజేయండి. పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం,
మీ రచనలను పోస్టు/ఇమెయిలు రూపంలో పంపండి. బాగున్నవాటిని తప్పక ప్రచురిస్తాం!

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
ISFC code: SBHY0020902

కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్‌సైటు: http://kottapalli.in



# విషయ సూచిక




# సెలవలు

నరేషూ, సురేషూ, లక్ష్మి, కళ, సుధ, మహేశ్, కార్తీక్, పండు, జ్యోత్స్న- అందరూ కలిసారు ఓ ఎండ పొద్దున.

"ఒరేయ్, అందరం ఇవాళ్ళ ఏదైనా సాహస కార్యం చేద్దాంరా!" అన్నాడు కార్తీక్.

"సాహస కార్యాలు చెయ్యాలంటే  గుహలు, పాడుబడ్డ కోటలు, దొంగలు, దయ్యాలు- ఇవన్నీ ఉండాలిరా, మన ఊళ్ళో ఏమున్నె?" విచారంగా అన్నది సుధ.

"అవి లేకపోయినా సాహసాలు చెయ్యచ్చు. ఉదాహరణకు, మన ఊరవతల మామిడి తోట ఉంది కదా, దానిలోంచి తలా నాలుగు మామిడి కాయలు కొట్టేసుకు రావటం-.." అన్నాడు సురేష్.

"ఆ తోటవాళ్ళు చాలా జాగ్రత్త పరులు. మనలాంటి వీరపిల్లలు మామిడి కాయలు కొట్టేయకుండా ఓ ముసలాయనను కట్టెతో సహా కాపలా పెట్టారు.  మనం ఆయన కంట పడ్డామంటే అంతే సంగతులు" అంది లక్ష్మి.

"అందుకే, అది సాహస కార్యం అని నేనన్నది. మనం కాయలు కొట్టేయాలి; ఆ తాతకి కనబడాలి, తప్పించుకోవాలి- వీరులైన మనలాంటివాళ్ళకు తగిన పని అది!" అన్నాడు సురేష్, ఆలోచిస్తూ.

"అవును! అవును!" అన్నారు అందరూ.

"మరయితే వెంటనే బయలు దేరదాం. పిల్లలు, స్త్రీలు ఇంట్లోనే ఉండండి. ఇలాంటి సాహస కార్యాలు మగపిల్లలకే పరిమితం!" అన్నాడు మహేశ్, ఉత్సాహంగా లేచి నిలబడి.

"నేనూ వస్తాను!" అని నిలబడ్డది జ్యోత్స్న. జ్యోత్స్నకి ఆరేళ్ళు. అక్కడ చేరిన పిల్లలందరిలోకీ చిన్నది జ్యోత్స్నే.

"ఆడపిల్లలూ సాహసాలు చెయ్యగలరు. ఝాన్సీ లక్ష్మీ బాయి గురించి మీకెవ్వరికీ తెలీదేమో. మా సార్ చెప్పారు మాకు!" అన్నది లక్ష్మి.

"నేనూ వస్తాను. నాకు మామిడికాయలు కావాలి" అంది జ్యోత్స్న.

"మేరీ కోం తెలుసుగా, ఒక్క దెబ్బ కొట్టిందంటే అంతే సంగతులు. వెళ్తే అందరం వెళ్తాం అంతే. ఆడ-మగా అని తేడాలు లేవు-అందరూ సాహస వీరులే, జాగ్రత్త" బెదిరించింది సుధ.

"నేనూ వస్తాను! నేనూ వస్తాను!" అంది జ్యోత్స్న మళ్ళీ.

"జోషీ, నువ్వొద్దులేవే, మరీ చిన్నదానివి. సరిగ్గా పరుగెత్తటం కూడా రాదు నీకు" అన్నాడు మహేశ్.

జోత్స్న ఏడుపు మొదలెట్టింది.

"ఇదిగో, మీకు ఏది కావాలంటే అది చేయండి. దాన్ని మటుకు ఏడిపించకండి!" అన్నది జ్యోత్స్న వాళ్లమ్మ, ఇంట్లోంచి బయటికి వచ్చి. వాళ్ళంతా చేరింది జ్యోత్స్న వాళ్ళింట్లోనే, మరి.

కొద్ది సేపటికి అందరూ తోట దగ్గరికి చేరుకున్నారు. "అదిగో కాయలు! అదిగో కాయలు!" అరవటం మొదలు పెట్టింది జ్యోత్స్న.

"ఉష్.. చప్పుడు చేయకండి. ముందుగా మనందరం తోట లోపలికి దూరాలి. రెండు జట్లుగా విడిపోయి, రెండు వైపులనుండీ చెట్ల మీదికి ఒకేసారి దాడి చేయాలి. కాపలా తాత ఒకవైపుకు

పరుగు పెడతాడు. అప్పుడు అటువైపు వాళ్ళు పారిపోవాలి. రెండోవైపువాళ్ళు అందరికీ సరిపడ కాయలు కొట్టుకొని వచ్చేస్తారు!" పథకం వివరించాడు సురేష్.

"పుల్ల పుల్లని కాయలు- " పాట మొదలెట్టింది జ్యోత్స్న. వెంటనే ఆ పాప నోరు మూసింది లక్ష్మి. పిల్లలంతా తోటలోపలికి దూరారు.

అంతలోనే "ఎవరదీ?!.." అంటూ కట్టెను తడుతూ వచ్చాడు కాపలా తాత.

పిల్లలంతా తలొక దిక్కుకూ పరుగు పెట్టారు. ఎవరికివాళ్ళు చేతికందిన రాళ్లనల్లా చెట్ల మీదికి విసిరేసారు. కొన్ని కొన్ని కాయలు రాలాయి అక్కడక్కడా.

తాత అరవటం మొదలెట్టాడు- "దొంగ పిల్లల్లారా! మీ పని అయిపోయింది కాసుకోండి- మిమ్మల్ని ఇక్కడే చెట్లకి కట్టేస్తాను" అని ముందుకి దూకాడు. మరుక్షణం తాత చేతికి చిక్కిపోయాడు, కాయలు ఏరుకుంటున్న సురేష్. దొరికీ దొరకగానే బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టాడు తోటంతా వినబడేట్లు.

తాత వాడి చేతిని దొరక పుచ్చుకొని- ఇదిగో- పిల్లలంతా మర్యాదగా ఇక్కడికి వచ్చేస్తారా, లేకపోతే వీడిని పట్టుకెళ్ళి పోలీసులకు అప్పజెప్పేదా?" అని అరిచాడు ఉత్సాహంగా.

పిల్లలందరూ ఎక్కడివాళ్లు అక్కడ నిశ్చేష్టులై నిలబడిపోయారు. ఇలా జరగొచ్చనిఎవ్వరూ ఊహించలేదు మరి. సురేష్ ఏడుపు పెద్దదైంది-ముసలాయన బెదిరింపులు కూడా. తర్వాతి ఐదు నిముషాల్లో పిల్లలంతా ఒక్కరొక్కరుగా బయటికి వచ్చి తాతముందు నిలబడ్డారు తలలు వంచుకొని.

"అందరూవచ్చేశారా, ఇంకా ఎవరన్నా దొంగలు మిగిలిపోయారా?" అరిచాడు తాత, పెద్ద పోలీసు లాగా.

"లక్ష్మి-జ్యోత్స్న ఏరి?" పిల్లలు ఒకళ్ల ముఖాలొకళ్ళు చూసుకున్నారు. అంతలో జ్యోత్స్న గొంతు

వినబడింది-

"తాతా! మరే, నాకు పది మామిడి కాయలు ఇస్తావా? వీళ్లందరికంటే ఎక్కువ?" అడిగింది జ్యోత్స్న, చెట్ల మరుగునుండి వచ్చి రాగానే.

ఆ పాపని చూడగానే తాత పద్ధతి మారిపోయింది.

"ఓఁ..ఇస్తా పాపా! వీళ్లకి ఎన్నెన్ని ఇమ్మంటావు?" అడిగాడు తాత.

"రెండు రెండు ఇవ్వు!" రాణీలాగా చెప్పింది జ్యోత్స్న.

తాత పిల్లలందరికీ తలా నాలుగు మామిడి కాయలూ ఇచ్చాడు- "ఇంకా కాయలు కావాలంటే ఇంటికి పంపిస్తానులెండయ్యా. అరిచానని ఏమీ అనుకోబాకండి." చెప్పాడు, జ్యోత్స్నను ఎత్తుకొని వాళ్ల వెంటే బయలుదేరుతూ.

తాత తమను కట్టేసి పోలీసులకు అప్పజెబుతాడని వణికిపోతున్న పిల్లలంతా నిర్ఘాంత పోయారు. అయినా ఇల్లు చేరాక గానీ వాళ్లకు అర్థం కాలేదు- వాళ్ళు వెళ్ళిన ఆ తోట జ్యోత్స్న వాళ్లదేనని!

అయినా పిల్లలందరికీ ఆనాటి సాహసకార్యం చాలా నచ్చింది. ఆ తృప్తిలో సెలవలన్నీ మా గొప్పగా గడిచిపోయాయి!

సెలవల్లో మనం చేసే సాహసకార్యాలన్నీ ఇలాంటి అల్లరిపనులే కానక్కర్లేదు. అయితే ఎవరికి వాళ్లం, మనకు గుర్తుండిపోయే పనులేవైనా చేస్తే బాగుంటుంది. అట్లాంటి పని ఒక్కటి చేసినా చాలు- మన సెలవులు అద్భుతంగా గడినట్లు లెక్క.

మరి మీరంతా సెలవల్ని అద్భుతంగా గడుపుతారనీ, ఆ ముచ్చట్లు మాకు రాసి పంపుతారనీ ఆశిస్తూ-

కొత్తపల్లి బృందం.



# నీతిచంద్రిక

సంధి - 2

*జరిగిన కథ: నీటి పక్షులకు, భూమ్మీద తిరిగే పక్షులకు మధ్య జరిగిన యుద్ధంలో నెమలిరాజు గెలిచింది. కాకి మేఘవర్ణుడు శత్రువర్గంలో చేరి, వాళ్ల కోటను కాల్చేయటం వలననే ఆ గెలుపు సాధ్యం అయ్యింది. గెలిచిన నెమలి చిత్రవర్ణుడు సంతోషంగా తన రాజ్యం చేరుకున్నది. ఇక చదవండి, నీతి చంద్రిక 49 వ భాగం...*

*మూలం- కీ.శే. కందుకూరి వీరేశలింగం సరళీకరణ- ఘడియారం వేంకట నారాయణ శర్మ*

ఆ విధంగా కోటను మొత్తాన్నీ కాల్చి తనకు గెలుపు కూర్చిన మేఘవర్ణుడిని నెమలిరాజు అనేక విధాలుగా మెచ్చుకుని, సన్మానించింది. అటుపైన అది సంతోషంగా మంత్రివైపుకు తిరిగి "పనిని పూర్తి చేసి గెలుపు సాధించిన సేవకుడి పని ఊరికేపోదు. అతనికి అన్ని విధాలా మేలుకూర్చే ప్రతిఫలం ఒకటి తప్పనిసరిగా కలుగుతుంది. ఇప్పుడు మనకు ఈ మేఘవర్ణుడు చేసిన మేలూ అంతే. ఇతనినే ఆ కర్పూర ద్వీప రాజ్యానికి రాజుగా పట్టాభిషేకం చేస్తాను" అన్నది. -

ధవళాంగుడు ఇంతవరకూ చెప్పి ఆపగానే

చిన్నబోయి, పరధ్యానంతో తన ఓటమిని గురించిన ఆలోచనలో పడిపోయిన హంసరాజుని చక్రవాక మంత్రి తిరిగి ఈ లోకంలోకి తెస్తూ "ప్రభూ! ఈ వార్తాహరుడేదో ముఖ్యమైన సమాచారాన్నే తెచ్చినట్లున్నాడు. ఇంకా పూర్తిగా చెప్పినట్లు లేదు. తమరు పరాకును వదిలి అతని మాటల్ని శ్రద్ధగా వినాలి" అన్నది.



ఆ మాటలకు తేరుకున్న హంసరాజు కొంగవైపు చూసి "ఓ ధవళాంగా! మేం వింటూనే ఉన్నాం. ఏదీ?! తర్వాత ఏంజరిగిందో వివరించు" అన్నది.

అప్పుడు ఆ సమాచారాన్ని మోసుకొచ్చిన ధవళాంగుడు ఇట్లా చెప్పింది- "అప్పుడు నెమలిరాజుకు అడ్డు వస్తూ వాళ్ల ప్రధానమంత్రి దూరదర్శి 'తమరి మాటకు అడ్డు చెబుతున్నందుకు నన్ను మన్నించండి. ఇతనికి తమరు మేలు చేయదలిస్తే మరేదైనా విధంగా సత్కరించి పంపటం మంచిదని నాకు అనిపిస్తున్నది. తలపైన పెట్టుకునే మాణిక్యం స్థానంలో పాదుకలను ఉంచరాదు: అదే విధంగా గొప్పవారు ఉండవలసిన స్థానాల్లో తక్కువవారిని ఎప్పుడూ నిలపకూడదు. అల్పుడిని పైకి తెచ్చి గొప్ప బాధ్యతాయుతమైన పదవిలో ఉంచిన రాజు కాళ్లకు వేసుకోవల్సిన చెప్పులు నెత్తిన పెట్టుకుని మోసేవాడిలాగా నవ్వులపాలు అవుతాడు. లోకంలో తమకు తెలియనిది ఏమున్నది? గౌరవించినా, అవమానించినా ఒకే విధంగా సేవిస్తూ ఉండటం అల్పుల నైజం. తలకు ఎక్కించుకున్నా, కాలితో తొక్కినా కూడా నాగుపాము వేసేది కాటే కదా?!

నిజానికి, అల్పబుద్ధి గలవానికి గొప్ప పదవిని

అంటగడితే ఒకప్పుడు మేలు చేసిన వాళ్లకే కీడు తలపెడతాడు. గతంలో నాగుపాము ఒకటి వర్తకుడిచేత ప్రాణభిక్ష పొంది కూడా తిరిగి అతనినే కాటువేయ బూనలేదా? తమరికి ఆ కథ చెబుతాను. శ్రద్ధగా వినండి:

## పాము - నక్క - వ్యాపారి

హిమాలయ పర్వత ప్రాంతంలో ఒక దట్టమైన అడవిలో, ఒక కాలిబాట వెంబడి నడుస్తూ పోతున్నాడు ఒక వ్యాపారి. ఆ సమయంలో ఆ అడవిలో దావానలం మొదలైంది. మంటలు అడవిని నలువైపులనుండీ చుట్టుముట్టాయి.

వ్యాపారి నడుస్తున్న కాలిబాటకు దగ్గరలోనే ఎండిపోయిన చెట్లు అధికంగా ఉన్న ఒక చోటున ఆ మంటలు దట్టంగా క్రమ్ముకున్నాయి. అలా ఆకాశం అంటేట్లు ఎగిసిన జ్వాలలలో చిక్కుకొని, ఎలా తప్పించుకోవాలో, ఎటుపోవాలో తెలియక కొట్టుమిట్టాడింది ఒక నల్లత్రాచు.

ఆ సమయంలోదానికి దేవునిమల్లే కనబడ్డాడు వ్యాపారి. అది పెద్ద గొంతుతో "ఓ మహాత్మా! ఆర్తులను కాపాడే ధార్మికోత్తమా! ఈ అడవిని నలువంకలా చుట్టుముట్టి దహిస్తున్న ఈ భయంకర దావానలంలో చిక్కి నా బోటి అల్పజీవి ప్రాణాలు కోల్పోవలసిందేనా? నా పాలిటి దేవుడిలాగా నువ్వుప్రత్యక్షమైనావు.



శరణు కోరిన వారికోసం ప్రాణాలొడ్డిన శిబి చక్రవర్తి వంటి అద్భుత కారుణ్యమూర్తివి, నిన్ను నా దగ్గరికి ఆ భగవంతుడే పంపి ఉంటాడు. నీ శరణు జొచ్చాను- ఇక నాకేమి కొదవ?! ఆలసించక రా! వచ్చి, నన్ను కాపాడి పో!" అంటూ అనేక విధాలుగా దీనంగా ప్రార్థించింది.

అదెంత కౄర జంతువైనా, అంతగా

మొరపెట్టుకున్న ఆ పాము దు:ఖాన్ని చూడలేకపోయాడు ఆ బాటసారి. అంతులేని దయతో అతను అటువైపుకి దూకి, పొద లోపల మిలమిలా మెరుస్తూ, చుట్టు చుట్టుకొని, వేడికి తట్టుకోలేక భయంతో ఏడుస్తూ ఉన్న పామును చూసి, తన చేతికర్ర కొసకు సంచిని ఒకదాన్ని వ్రేలాడదీసి, రెండవ కొసను చేతబట్టుకొని, ఉపాయంగా సంచిని పొదలోకి జొనిపాడు.

ఆపదలో ఉన్న ఆ పాము దొరికిన ఆ అధారాన్ని దొరకబుచ్చుకొని గబగబా సంచిలోకి దూరింది. వెంటనే ఆ వ్యాపారి మెల్లగా సంచిని పొదలోంచి బయటికి తీసి, పామును మంటలకు ఆవలగా విడిచిపెట్టాడు.

'మొక్కబోయిన గుడి విరిగి మీద పడింది' అన్నట్లు, అదే క్షణంలో ఆ నల్లత్రాచు బుసకొడుతూ లేచింది! 'పాములు కనబడగానే చంపుతూంటారు మనుషులు. కాబట్టి అట్లాంటి వాళ్ల చేత చిక్కినప్పుడు కాటు వెయ్యకుండా వదలకూడదు మేము!' అంటూ నోరు తెరచి, నాలుక చాపుతూ, అతని మీదికే దూకి, కరవబోయిందా పాము!

ప్రాణభయంతో బాటసారి పరుగు పెట్టటం, పాము వదలక అతని వెంట పడటం మొదలయిందప్పుడే.

అంతలో అక్కడికి దగ్గర్లోనే మరో పొదలో నక్కి ఉన్న నక్క ఒకటి గబుక్కున బయటికి వచ్చి, పాముకు, వ్యాపారికి మధ్య నిలబడి- " ఓ నాగరాజా! ఊరికే ఎందుకు, భయపడి పారిపోతున్న ఈ పిరికివాడి వెంట పడుతున్నావు, నువ్వు?! కొంచెం ఆగి, అసలు సంగతేంటో నాకు చెప్పరాదా, నేనూ నా చేతనైన సహాయం చేస్తాను?!" అన్నది.

ఆ పాము నవ్వుతూ జరిగిన సంగతి అంతా చెప్పగానే నక్క ఆశ్చర్యపోయినట్లు నటిస్తూ "మిత్రమా! నువ్వు ఇప్పుడు చెప్పిన కథ బాగానే ఉన్నదిగానీ, వాస్తవం అనిపించటం లేదు. లేకపోతే, ఇంత చిన్న ఈ సంచీ ఎక్కడ, అంత పెద్ద నీ శరీరం ఏమిటి; ఈ సంచిలోకి దూరటం ఏమిటి?! నువ్వేమో బారెడు పొడుగున్నావు; ఈ సంచి పట్టుమని జానెడంత కూడా లేదు. నేను నమ్మలేను

నాయనా" అన్నది.

'కాదు- ఇందులో ఆశ్చర్యం ఏమున్నది? కావాలంటే చూడు, నేనెట్లా దూరతానో' అని వెర్రి పాము జరజరా ఆ చేతి సంచీలోకి పాకి చుట్ట చుట్టుకొని కూర్చొని చూపింది.



'కట్టెయ్యి కట్టెయ్యి- సంచీ మూతిని చటుక్కున తాడుతో కట్టెయ్యి!" అని నక్క సైగలు చెయ్యగానే, అప్పటివరకూ పెదవులు కొరుక్కుంటూ నిల్చున్న వ్యాపారి గబుక్కున ముందుకు దూకి, సంచీ మూతిని గట్టిగా బిగించి కట్టి, ఆపైన తన చేతి కట్టెతో సంచి మీద బలంగా నాలుగు దెబ్బలు వేసి, పామును పర లోకానికి పంపించాడు. ఆనక నక్క తెలివిని కొనియాడి, తన దారిన తాను పోయాడు.

అలాగ, కొందరు మనుష్యులు తమకు మేలుచేసిన వారికే కీడు తలపెడుతూ ఉంటారు. ఇసుకలో వేసిన బొమ్మ మాదిరి, పిల్లిని మంచిదానిగా జమకట్టి దాన్ని సేవించబోయిన కుందేలు- పింజల పిట్టల కథలో మాదిరి, నీచులకు చేసిన మేలు కూడా ఎక్కువ కాలం నిలువజాలదు. మీకు ఆ కథ చెబుతాను వినండి:

## కుందేలు- పిట్ట- పిల్లి కథ

వింధ్యారణ్యంలోఒక చెట్టు తొర్రలో చాలా కాలంగా కపింజలం అనే పక్షి ఒకటి నివసిస్తూ ఉండేది. ఒకనాటి సాయంకాలం దట్టమైన మేఘాలు ఆకాశాన్నంతా కమ్ముకున్నాయి. "కడవలను బోర్లించారా' అన్నట్లు, మహా భయంకరమైన జడివాన ఒకటి అడవినంతా ముంచెత్తింది. కపింజలం పాపం ఆ వానలో చిక్కుకున్నది. బాగా తడిసిపోయిన ఆ పక్షి చాలా శ్రమపడ్డది; కానీ సమయానికి తన గూడును చేరుకోలేకపోయింది.

అయితే ఆలోగా దీర్ఘకర్ణం అనే కుందేలు ఒకటి, అది కూడా వానలో బాగా నాని, తల దాచుకునేందుకు తావు వెదుకుతూ, అదృష్టం కొద్దీ కపింజలం నివసించే చెట్టు తొర్రను కనుగొన్నది. చాలా సంతోషంతో అందులోకి దూరి, వెచ్చగా పడుకున్నది.



ఇంతలో కపింజలం తన గూటిని వెతుక్కుంటూ చిమ్మ చీకట్లో వచ్చి చేరుకొని, తన ఇంట్లో ముడుచుకొని పడుకున్న కుందేలును చూసి, అదిలిస్తూ, కోపంగా- "ఓసీ, దొంగ కుందేలూ! నేనులేని సమయం చూసుకొని నా ఇంట్లోకి దూరి, పైగా పడుకొని గురకపెట్టి నిద్రపోతున్నావే! నీకెంత పొగరు?! ఇకనైనా ఆలస్యం చెయ్యక, నా ఇల్లు నాకు విడిచిపెట్టి, లేచి అవతలికి పో! లేకపోతే- చెబుతున్నాను, నీ ప్రాణాలు నీవి కావు!" అని అరిచింది.

దాంతో కోపం వచ్చిన కుందేలు ఎదురు తిరిగి -"చాలు చాలు, నీ బెదిరింపులు ఇంక కట్టిపెట్టు. దీర్ఘకర్ణుడి ముందరా నీ కుప్పిగంతులు?!

దిగుడు బావులు, చేద బావులు, చెట్ల తొర్రలు- వీటిని ఎవరు ముందు ఆక్రమించుకుంటారో, అవి వాళ్లవే అవుతాయి. అంతే తప్ప ఏనాటికీ ప్రత్యేకంగా అవి ఒకరి సొత్తులుకావు. మారు మాట్లాడకు- పో! పో! కాదంటే- ఎవరైనా పెద్దమనుషుల దగ్గరకు పోదామంటే చెప్పు, వస్తాను. న్యాయం ఏమిటో వాళ్లే తేలుస్తారు" అన్నది.

(అప్పుడేమయిందోమళ్ళీ చూద్దాం..)

**నిజాన్ని ఎదుర్కొనే ధైర్యం లేని వాళ్ళే అబద్ధాన్ని ఆశ్రయిస్తారు**



# ప్రయత్నం

*ఏదైనా పని జరగాలంటే మనం దానికి తగిన ప్రయత్నం చెయ్యాల్సిందే. ఇదిగో, ఈ కథ చదవండి....*
*సేకరణ: పివిఆర్ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల విద్యార్థి (పేరు రాయలేదు), గుండువారిపల్లి, తలుపుల మండలం, అనంతపురం*

అనగనగా ఒక ఊళ్ళో సోమేష్ అనే కుర్రవాడు ఒకడు ఉండేవాడు. అతను ప్రతిరోజూ ఉదయం క్రమం తప్పకుండా గుడికి వెళ్ళి దేవుడిని భక్తితో ప్రార్థించేవాడు. తనని ఏమీ కోరని సోమేష్‌ని చూస్తే దేవుడికి కూడా ముద్దుగా ఉండేది.

అయితే ఒకసారి సోమేష్‌కి చాలా కష్టాలు ఎదురయ్యాయి. డబ్బులతో చాలా ఇబ్బంది అయ్యింది. ఇక తట్టుకోలేక, అతను హడావిడిగా గుడికి వెళ్ళి దేవుడిని ప్రార్థించాడు "దేవుడా! నిన్నెప్పుడూ ఏదీ కోరలేదు. ఇప్పుడు నా కోరిక తీర్చు! నాకొక లాటరీ తగిలేట్లు చెయ్యి"అని.

దేవుడు అప్పటికప్పుడు ప్రత్యక్షమై "సరే! నీ

కోరిక తీరుస్తాను" అని చెప్పి మాయం అయిపోయాడు.

దేవుడు తన ప్రార్థనను విన్నందుకు, తన కోరిక తీరుస్తానన్నందుకు సోమేష్‌కి చాలా తృప్తి కలిగింది.



తర్వాత కొద్ది రోజులు గడిచాయి; రోజులు కాస్తా నెలలయ్యాయి; సంవత్సరం కావస్తున్నది-

సోమేష్‌కు ఏమీ లాటరీ తగల్లేదు!

అతనికి చాలా కోపం వచ్చింది. "ఏంటి స్వామీ, ఇది! అడగక అడగక ఒక్క కోరిక కోరానే! ఆ ఒక్క కోరికనూ తీర్చలేకపోయావా? మరి మాట ఇచ్చిందెందుకు, తప్పేదెందుకు? నువ్వేం దేవుడివయ్యా!" అని నిలదీశాడు దేవుడిని.

దేవుడు మళ్ళీ ప్రత్యక్షమై " చూడు సోమేష్! నీకు 'లాటరీ తగిలేట్లు చేస్తాను' అని నేను మాట ఇచ్చాను, నిజమే. కానీనువ్వు అసలు లాటరీ టిక్కెట్టే కొనకపోతే నేను ఏం చేసేది?" అని నవ్వి, మాయమైపోయాడు.

మానవ ప్రయత్నం లేనిది, దేవుడు కూడా ఏమీ చెయ్యడు!

గణిత క్విజ్

1. ఘూంతాంకము అనే భావనని ప్రవేశపెట్టిన గణిత శాస్త్రజ్ఞుడు ఎవరు? ( డయోఫాంటస్ )
2. లీలావతి గణితం రచించినదెవరు? ( భాస్కరాచార్యుడు )

*-రెడ్డి శ్రీను, 7వ తరగతి, రెడ్డివారిపల్లి.*



# దొంగల ముఠా

*మూడు నాలుగేళ్ళ క్రితం ఈ కథని ఇంగ్లీష్ పరీక్షలో రాశాడట గౌతమ్. ' దీన్ని ఏదో పుస్తకంలో చదివాను - అందరికీ తెలిసిన కథే" అంటాడట. చివరికి వాళ్ళమ్మ పోరు భరించలేక 'మీరూ చదవొచ్చు' అని కొత్తపల్లికి పంపించాడట- అదీ, ఈ కథ కథ!*

*మూలం: ఆంగ్లం* *తెలుగు: గౌతమ్, పన్నెండో తరగతి, రిషివ్యాలీ స్కూలు, మదనపల్లి.*

అమెరికాలోని చికాగో నగరం. అత్యంత ధనికులు నివసించే ప్రదేశం అది. మిసెస్ డౌన్స్ అనే ముసలావిడ అక్కడే ఒక ఇంట్లో ఒంటరిగా ఉంటోంది. ఆవిడకి ఒక్కతే కూతురు- న్యూయార్కులో ఉద్యోగం చేస్తోంది ఆమె. ప్రతి నెలలోనూ ఒక వారాంతంలో తల్లి దగ్గరకి వస్తుంది. అట్లా వచ్చినప్పుడే తల్లికి నెలంతా అవసరమయ్యే సామాన్లు కొనివ్వడం, ఇల్లంతా సర్ది ఇవ్వడం చేసి పెడుతుంది.

దాదాపు ఆరు నెలలుగా ఆ ప్రాంతంలో దొంగతనాలు జరుగుతున్నాయి. దొంగల ముఠా వాళ్ళు కొందరు, ఎవరింట్లో దొంగతనం చేయబోతున్నారో వాళ్ళ ఇంటికి ఫోన్ చేసి మరీ వస్తున్నారు: సమయం చెప్పి మరీ దోపిడీలు చేస్తున్నారు. ఎవరైనా ఆ సమాచారాన్ని పోలీసులకి అందిస్తే వేరే ఏదో సమయంలో దొంగతనం చేయడమే కాదు- పోలీసులకి చెప్పినందుకు శిక్షగా ఇంట్లోవాళ్లని అందరినీ చంపేస్తున్నారు.

"కోబ్రా, వైపర్, బ్లాక్ స్నేక్, అనకొండ,

మాంబా, రాటిల్ స్నేక్.... " ఇట్లా పాముల పేర్లు పెట్టుకుని ఫోన్లు చేస్తున్నారు వాళ్ళు. చెప్పి మరీ దొంగతనాలు చేస్తున్న ఈ ముఠా గురించి అమెరికా అంతా అట్టుడికినట్లు ఉడికిపోతున్నది. వీళ్ళని పట్టుకోవడానికి పోలీసులు తీవ్రంగా ప్రయత్నాలు చేస్తున్నారు.



ఆ రోజు శనివారం. కూరగాయలు తెచ్చుకుందామని మార్కెట్‌కి వెళ్ళడానికి తయారవుతున్నది మిసెస్ డాన్స్. అంతలోనే ఫోన్ మోగింది- "హలో.. హలో..-"

"హలో నేను వైపర్‌ని మాట్లాడుతున్నాను. ఈరోజు నాలుగు గంటలకి మీ ఇంటికి వస్తున్నాను" అని అవతల వ్యక్తి ఫోన్ పెట్టేశాడు.

"అమ్మో! వచ్చేస్తున్నారు - మా ఇంటికి వచ్చేస్తున్నారు ఆ బందిపోటు దొంగలు!! ఏం చేయాలి?.. పోలీసులకి ఫోన్ చేస్తే నన్ను చంపేస్తారు. ఇప్పుడెలా?... ఇంట్లో ఉన్న ఫోన్‌ని 'టాప్' చేసి ఉంటారు... బయటికి వెళ్ళి పబ్లిక్ ఫోన్ నుండి ముందు అమ్మాయికి ఫోన్ చేస్తే!!?... అమ్మో! వద్దు! మా ప్రాంతంలో ఉన్న ఫోన్లన్నిటినీ గమనిస్తూండి ఉంటారు! అమ్మాయికి ఫోన్ చేస్తే నా ప్రాణంతోపాటు అమ్మాయి ప్రాణం కూడా తీస్తారు..! ఇప్పుడెలా?... దేవుడా! కాపాడు - ...ఒక పని చేస్తే?!.. ఇంట్లో ఉన్న నా నగలు తీసుకెళ్ళి లాకర్ లో పెట్టేస్తే?.. అదే మంచిది... వాళ్ళకి అనుమానం కలగకుండా కొన్ని నగలు, కొంత డబ్బు ఇంట్లో ఉంచి, మిగతావి లాకర్లో పెట్టేస్తే సరి' అనుకుంటూ, వణుకుతున్న శరీరాన్ని కూడ దీసుకొని, సోఫాలోంచి లేవబోయింది మిసెస్ డాన్స్.

అంతలోనే "ట్రింగ్!.. ట్రింగ్..!!" అంటూ ఫోన్ మోగింది మళ్ళీ.

మిసెస్ డౌన్స్ భయం భయంగా ఫోన్ ఎత్తింది-

“మిసెస్ డౌన్స్- ఎక్కడికీ వెళ్ళొద్దు. ఖచ్చితంగా నాలుగు గంటలకి వచ్చేస్తాను" అన్నాడు వైపర్, టప్పున ఫోన్ పెట్టేస్తూ. అతను ఫోను పెట్టేసిన ఆ శబ్దం ఆమె గుండెల్లో బాంబు పేలినట్లు పేలింది. తుఫానులో చిగురాకు లాగా వణికిపోయింది ఆవిడ-

"అమ్మో! వాళ్ళు నా ఆలోచనని కూడా కనిపెడుతున్నారు. అంటే మొత్తం ఇల్లంతా ఏవో పరికరాలు పెట్టి ఉంటారు. వెధవ సైన్స్. ఈ సైన్సు టెక్నాలజీల వల్ల మనుషుల మనుగడే నాశనమయేట్లుగా ఉంది" అనుకుంటూ అలాగే కూలబడిపోయి కూర్చున్నది.

నిమిషాలు.. గంటలు.. గడుస్తున్నాయి. భోజనం చేయడానికి కూడా లేవలేదు ఆవిడ. ఆవిడ సోఫాకు, ఆవిడ చూపులు గడియారానికి అతుక్కుపోయి ఉన్నాయి.

సాయంత్రం మూడు అయ్యింది. కొంచెం తేరుకున్న మిసెస్ డౌన్స్ నిదానంగా లేచి బాత్‌రూమ్‌కి వెళ్ళొచ్చింది. టీ త్రాగాలని- పిస్తోంది; కానీ వంటగదిలోకి వెళ్ళాలంటేనే ఆమెకి భయంగా ఉంది. మళ్ళీ సోఫాలో కూలబడి టైమ్ చూసింది- ఇంకా మూడూ పదే...



మూడున్నర...... మూడూ యాభై.......

మూడూ యాభై ఒకటి... రెండు.... మూడు.... నాలుగు.... ఐదు.......

అంతలోనే “బర్....ర్ ర్ ర్...” అంటూ డోర్ బెల్ మోగింది.

మిసెస్ డౌన్స్ ఒక్కసారిగా ఉలిక్కిపడింది. అదురుతున్న గుండెతో మెల్లగా లేచింది. ఆవిడ కాళ్ళూ, చేతులూ కంపించి- పోతున్నాయి. తలుపు దగ్గరకి వెళ్ళి

నిలబడింది..

నిదానంగా.... చా..లా- నిదా...నంగా, కంపించిపోతున్న చేతితో... లాచ్ ని తిప్పి- తలుపు తీసింది-

ఎదురుగ్గా అతను......

అతని చేతిలో బూజు దులిపే కర్ర, టాయిలెట్ శుభ్రం చేసే బ్రష్‌లూ....

“సారీ మిసెస్ డౌన్స్! సారీ ఐ యామ్ ఫైవ్ మినిట్స్ ఎర్లీ. ఐ యాం వైపర్" అన్నాడతను.

ఆంగ్లంలో 'వైపింగ్' అంటే శుభ్రం చేయటం. అలా చూస్తే ఇళ్ళు శుభ్రం చేసే ఇతను 'వైపర్' అవుతాడు! 'దొంగ దొంగ' అని తను ఊరికే భయపడిందన్నమాట ఇంతసేపూ! ఎవరో దొంగ అనుకున్నది ఇతన్నేనా!!

మిసెస్ డౌన్స్ ఊపిరి పీల్చుకున్నది. తడబడుతూ "కమిన్" అంది-

ఆమె గొంతులో నిండా సంతోషం.

కూరగాయల కవిత

వంకాయ తినడానికి- వంకెందుకు!
బెండకాయ తినడానికి - బెంగెందుకు!

చిక్కుడు కాయ తినడానికి - చిరాకెందుకు!
దోసకాయ తినడానికి దోబూచులెందుకు!

కాకరకాయచేదైనా అది కడుపుకుమందేరా!

గుమ్మడికాయ తినడానికి- గోలెందుకు!
క్యాబేజీతినడానికి- కేకెందుకు!

బీట్ రూట్ తినడానికి - భీతెందుకు!
ముల్లంగి తినడానికి - మూర్ఛెందుకు!

దుంపలు తినడానికి- దూకుడెందుకు!
అమ్మ చెప్పిన మాట- వినవెందుకు!
చాక్లెట్ ఇస్తే- తీసుకుంటావెందుకు!

*-టి.సునీల, 8వ తరగతి, ZPHS, గుండువారిపల్లి.*




# మాట కారి మంగయ్య

*సేకరణ: చెదురుపల్లి చిత్రలేఖ, 7 C4, శ్రీ చైతన్య టెక్నో స్కూల్, మొగల్రాజపురం, విజయవాడ*

కృష్ణాపురంలో ఉండే మంగయ్య భలే మాటకారి. తన మాటలతో ఎదుటివాళ్లను తికమక పెట్టి, వాళ్ళు బిత్తరపోతే ఆనందించటం అతనికి ఇష్టం. అతని సంగతి తెలిసిన వాళ్ళు వీలైనంత వరకూ అతని దగ్గరికి వచ్చేవాళ్ళు కాదు.

అయితే కొత్తగా ఊరికి వచ్చిన శేషయ్యకు ఈ సంగతి తెలీదు. మంగయ్య తనను రోజూ పలకరిస్తుంటే తనూ పలకరింపుగా నవ్వేవాడు.

ఒకసారి శేషయ్యకు కొంత డబ్బు అవసరం పడి, మంగయ్యను అప్పడిగాడు: "మంగయ్యగారు, చాలా అవసరంలో ఉన్నాను. డబ్బు అప్పుగా ఇస్తే నెలరోజుల్లో తిరిగి ఇచ్చేస్తాను" అని.

"నా దగ్గర డబ్బు లేదు. వేరే ఎవరినైనా

అడుగు" అన్నాడు మంగయ్య క్లుప్తంగా.



శేషయ్య సరేనని వెళ్లిపోతుండగా మంగయ్య అతన్ని వెనక్కి పిలిచాడు: "నీకు బొత్తిగా కృతజ్ఞత లేదు శేషయ్యా!" అంటూ.

"అదేంటయ్యా! తమరు నాకు డబ్బు అప్పుగా ఇవ్వనే లేదు కదా, మరి కృతజ్ఞత ఎందుకు?" అని అడిగాడు శేషయ్య ఆశ్చర్యపోతూ.

"ఓరి వెర్రివాడా! నేను నీకు చేసిన మేలు గుర్తించనే లేదు కదా! నేను నిన్ను 'రేపు రా-మాపు రా' అని నా చుట్టూ రోజూ త్రిప్పుకొని ఉండవచ్చు. ఒకవేళ నువ్వు నీ ఆత్రం కొద్దీ వచ్చావే అనుకో, 'వారం తర్వాత రా-పదిరోజుల తర్వాత రా' అని మళ్ళీ మళ్ళీ రమ్మని ఉండచ్చు. నేను అట్లా చేసి ఉంటే నీ సమయం ఎంత వృధా అయ్యేదో ఆలోచించావా? నీ కెంత బాధ కలిగేదో, ఎంత కోపం వచ్చేదో ఆలోచించావా? అట్లా రోజూ నా చుట్టూ తిరిగి తిరిగి ఇక నీకు వేరే వాళ్లను అప్పు అడిగే అవకాశం కూడా ఉండేది కాదు! అటు నీకు అప్పూ దొరికేది కాదు; ఇటు సమయమూ పోయేది! ఇప్పటికైనా అర్థమైందా, నీకు ఎంత మేలు చేశానో?! మరి నాకు కృతజ్ఞతలు చెప్పవా?" అన్నాడు మంగయ్య చిరునవ్వుతో.

శేషయ్య బిత్తరపోయి సణుక్కుంటూ ఇంటికి వెళ్ళాడు. ఇల్లు చేరినా అతని వాలకం మారలేదు- అంత గందరగోళ-పడిపోయాడన్నమాట.

శేషయ్య కొడుకు ఫణి జరిగిన సంగతంతా తెలుసుకున్నాడు. ఫణి యువకుడూ, ఉత్సాహవంతుడున్నూ. 'ఓహో! మంగయ్య పని ఇలా ఉందా! ఇప్పుడు అతనే బిత్తరపోయేట్లు చేయటం నా పని!"

అనుకున్నాడు.



ఒక మూడు-నాలుగు రోజుల తర్వాత ఫణి మంగయ్య ఇంటి ముందుగా వెళ్ళాడు. మంగయ్య అతడిని పట్టించుకోలేదు. మంగయ్యని దాటి ముందుకెళ్ళిన ఫణి వెనక్కి తిరిగొచ్చి, మంగయ్యతో "మరి నాకు కృతజ్ఞతలు చెప్పరా, మంగయ్య గారూ?!" అని అడిగాడు వెటకారంగా.

మంగయ్య బిత్తరపోయి 'ఎందుకు చెప్పాలి?' అన్నాడు.

అందుకు ఫణి- "నేను మిమ్మల్ని అప్పు అడగకుండా వెళ్ళిపోతున్నందుకు! ఒకవేళ నేను మిమ్మల్ని అప్పు అడిగానే అనుకోండి, మీరు అప్పుడు నాకు అప్పు ఇవ్వకుండా లేదని చెప్పేవాళ్ళు. అట్లా నాకు ఎంతో మేలు చేసేవాళ్ళు! అట్లా నాకు ఒక గంట సేపు మేలు చేసీ చేసీ, మీరు మాత్రం అలసిపోయేవాళ్ళు! మీ గొంతు నొప్పి పుట్టేది; మళ్ళీ ఆసుపత్రి ఖర్చులు, మందులు- ఎంత సమయం వృధా, ఎంత డబ్బు వృధా అయ్యేది?! ఇప్పుడు నేను అవన్నీ మిగిల్చాను కదా, మరి నాకు కృతజ్ఞతలు చెప్పరా?" అన్నాడు.

మాటకారి మంగయ్య నోట మాట రాలేదు.

ఇతరులకు మనం ఏది ఇస్తే అది మనకు తిరిగి వస్తుంది!

**ఏం ఫలం?!**

నవ్వు!

టీచర్: శ్రీను! కొన్ని ఫలాల పేర్లు చెప్పు!

శ్రీను: గ్రహ ఫలం, జాతక ఫలం, రాశిఫలం, వారఫలం, ప్రతిఫలం.

*- సి. రెడ్డిశ్రీను 7వ తరగతి, పివిఆర్ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, టిగుండువారిపల్లి*



# మోసపోయిన రైతు

*ఎవరు మనల్ని మోసం చేస్తారో తెలీదు; అట్లా అని ఎవ్వరినీ నమ్మకుండా ఉండటమూ కుదరదు..మరేం చేయాలో ఈ కథలో లేదు. ఎవరికివాళ్లం, ఎప్పటికప్పుడు ఆలోచించుకుందాం.*

*రచన: ప్రమోద్, ఐదవ తరగతి, ప్రభుత్వ ప్రాధమికోన్నత పాఠశాల, టేకుమట్ల, జైపూర్ మండలం, ఆదిలాబాదు జిల్లా*

అనగా అనగా ఒక ఊరిలో రామయ్య అనే రైతు ఉండేవాడు. అతని భార్య పేరు లక్ష్మి. అతనికి ఒక ఆవు, ఒక బర్రె ఉండేవి. వాటి పాలు అమ్ముకుంటే వచ్చే డబ్బుతోటే అతని కుటుంబం నడిచేది. అలా మిగిలిన డబ్బులతో వాళ్ళు ఎకరం భూమి కూడా కొనుక్కోగలిగారు. రామయ్యకు ఊళ్ళో అంతా 'మంచివాడు' అని పేరుండేది. నిజంగా కూడా అతనికి ఎవ్వరినీ మోసం చెయ్యటం తెలీదు. పాలు అమ్మగా వచ్చిన డబ్బులు, పంట డబ్బులతో వాళ్ళు హుందాగా బ్రతకగలిగేవాళ్ళు.

రామయ్యకు చదువుకున్నవాళ్లంటే చాలా నమ్మకం. అతనికి చదువు వచ్చిన దోస్తులు (స్నేహితులు) ఇద్దరు ఉండేవారు. ఈ ఇద్దరు దోస్తులూ 'మీ ఊరికి మంచి నీళ్ళు రప్పిస్తాము; ఊళ్ళోవాళ్లందరినీ అడిగి ఒక్కొక్కళ్ళ దగ్గరా ఇంత డబ్బు ఇప్పించుకో' అని బలవంత పెట్టారు అతన్ని.

నీళ్ళంటే ఎవరికి ఆశ ఉండదు? రామయ్య ఊళ్ళో అందరినీ అడిగి, డబ్బులు తీసుకొచ్చి దోస్తులకు ఇచ్చాడు. డబ్బులు తీసుకున్న దోస్తులిద్దరూ మాయం అయిపోయారు. మళ్ళీ ఎవ్వరికీ కనబడనే లేదు!

బాధ్యత గల రామయ్య తన ఆవును, బర్రెను అమ్మి ఊళ్ళో వాళ్లందరికీ డబ్బులు కట్టాడు. ఆ తర్వాత రామయ్య, లక్ష్మి ఇద్దరూ కైకలికి (కూలికి) పోయి, పొదుపుగా బ్రతికి, అతి కష్టం మీద డబ్బుల్ని కూడబెట్టి, మళ్ళీ ఆవును బర్రెను కొనుక్కో గలిగారు.

'మోసగాళ్లను ఎవ్వరినీ నమ్మకూడదు' అని నిశ్చయం చేసుకొని, అప్పటినుండి ఇద్దరూ హాయిగా బ్రతికారు.

## గుండ్రం!



గుండ్రం! గుండ్రం!
గిర గిర తిరిగే
చక్రం గుండ్రం
సూర్యుడు గుండ్రం
చంద్రుడు గుండ్రం
రాత్రిపగలు
గుండ్రం! గుండ్రం!
నయనం గుండ్రం
ముఖమూ గుండ్రం
నడిచే వాహన చక్రం గుండ్రం!
ఆపిల్ గుండ్రం
గాజులు గుండ్రం
చదవకపోతే మార్కులు గుండ్రం!
భూమి గుండ్రం
బూరెలుగుండ్రం
ఎక్కువ తింటే పొట్ట గుండ్రం!

*- సి.రెడ్డి శీను, 7 వ తరగతి, zphs, గుండువారిపల్లె*



# ధైర్యవంతుడు

*జానపద కథలు ఎన్ని చదివితే మనకు అన్ని ఐడియాలు వస్తాయి.. ఇదిగో, ఈ కథ చదివి చూడండి..*

*రచన: కె. వెంకటసాయి, ఎనిమిదవ తరగతి, సుద్దకుంటపల్లి, సోమందేపల్లి మండలం, అనంతపురం జిల్లా*

ప్రతాపపుర రాజ్యాన్ని రాజేంద్రవర్మ అనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఆయన మంత్రి విజయేంద్రుడు. మంత్రి గారి సహాయంతో రాజేంద్రవర్మ ప్రతాపపుర రాజ్యాన్ని చక్కగా పరిపాలించేవాడు.

రాజుగారి కొడుకు వీరసేనుడు, మంత్రి కుమారుడు చక్రసేనుడు, ఇద్దరూ చిన్నప్పటి-నుండీ కలిసి పెరిగారు. ఇద్దరికీ ఐదేళ్ళు రాగానే రాజుగారు, మంత్రిగారు వాళ్లని ఒక మంచి గురువుగారి దగ్గర చేర్చారు. గురుకులంలో ఇద్దరూ విలువిద్య, ఖడ్గవిద్యలతో సహా అనేక విద్యల్లో ప్రవీణులయ్యారు. గురువుగారు వాళ్లనిద్దరినీ పరీక్షించి, మెచ్చుకొని, దీవించి పంపారు.

సంతోషంగా ఇంటికి వచ్చిన వీరసేనునితో రాజేంద్రవర్మ "కుమారా! విద్యా బుద్ధులు నేర్పిన గురువుగారికి గురుదక్షిణగా విలువైన వస్తువులు, సంపదలు అనేకం ఇచ్చాం. బాగుంది. అయితే జన్మనిచ్చి, సరైన గురువు వద్దకు పంపి చదివించిన నాకు కూడా నువ్వు ఏదైనా మంచి బహుమానం ఇవ్వవలసి ఉన్నది. కొంత కాలం పాటు దేశాటన చేసి, నాకు నచ్చే బహుమతినొకదాన్ని దేన్నైనా తీసుకురా" అన్నాడు.

"సరే" అని వీరసేనుడు గుర్రంమీద దేశాటనకు బయలుదేరాడు. చక్రసేనుడు కూడా మిత్రుడి వెంట బయలుదేరాడు. మిత్రులిద్దరూ చాలా దూరం వెళ్ళాక వాళ్లకొక నది ఎదురైంది. నది ఒడ్డునే చక్కని పండ్లతో అలరారే మామిడి చెట్టు కూడా ఒకటి కనిపించింది. అలసిన గుర్రాలకు నీళ్ళు త్రాగించి, గడ్డి మేసేందుకు వదిలి, మిత్రులిద్దరూ విశ్రాంతిగా చెట్టుక్రిందికి చేరారు.

అంతలో అక్కడికొక సాధువు వచ్చాడు. మిత్రులిద్దరినీ చూసి, "రాజకుమారా! మంత్రి కుమారా! ఇంత దూరం, ఈ అడవి మార్గాన వచ్చారెందుకు?" అని ప్రశ్నించాడు.

స్నేహితులిద్దరూ కొంచెం ఆశ్చర్యపోయారు- ఎందుకంటే వాళ్ళిద్దరూ మారు వేషాల్లో ఉన్నారు మరి! "ఇతనెలా గుర్తు పట్టాడు?" అనుకున్నారు.



అంతలోనే ఆ సాధువు వాళ్లతో "నాయనలారా! మీరిప్పుడు ఉత్తరదిశగా రెండు రోజుల పాటు ప్రయాణించండి. అక్కడ మీకు పాడుబడిన శివాలయం ఒకటి కనబడుతుంది. ఆ శివాలయంలో

శివలింగానికి ఎదురుగా ఉన్న నందిని పట్టుకొని బలంగా త్రిప్పితే, ఒక సొరంగ మార్గానికి దారి వెలువడుతుంది. మీరు ఆ సొరంగంలో ప్రవేశించి దక్షిణ దిశగా ముందుకు వెళ్తే ఒక కీలుగుర్రం, విక్రమార్కుడు ఉపయోగించిన ఖడ్గం దొరుకుతాయి. వాటికి కావలిగా సర్పాలు అనేకం ఉంటాయి; జాగ్రత్త. మీరు ఆ రెండింటినీతీసుకొని, మరింత ముందుకు రావాలి. మరొక ఆరు గంటలు ప్రయాణించాక మీకు మళ్ళీ మెట్లు, ఈసారి పైకి వచ్చేవి, కనబడతాయి. అవి మిమ్మల్ని సరిగ్గా ఈ ఊరి చివరనున్న కాళికాలయంలోకి తీసుకొస్తాయి. నేను మిమ్మల్ని మళ్ళీ అక్కడ కలుస్తాను. లోక కల్యాణం కోసం మీరిద్దరూ ఈ సాహసాన్ని చేయండి!" అని ఇద్దరినీ దీవించి వెళ్ళిపోయాడు.

రాజకుమారుడు, మంత్రికుమారుడూ ఒకరి ముఖాలొకరు చూసుకొని, సాధువు చెప్పిన దిశగా బయలు దేరారు. రెండు రోజులు అలా ప్రయాణించాక సాధువు చెప్పినట్లుగానే వారికి పాడుబడ్డ శివాలయం ఒకటి కనిపించింది.

రాజకుమారుడు శివునికి నమస్కరించి, శివలింగానికి ఎదురుగా ఉన్న నందిని పట్టుకొని బలంగా త్రిప్పాడు. ఆశ్చర్యం! నంది అలవోకగా తిరిగింది! శివునికి వెనుకగా ఉన్న రహస్యపు అర ఒకటి ప్రక్కకు తొలిగి, లోనికి మెట్లు కనిపించాయి!



మిత్రులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకొని, లోనికి ప్రవేశించారు. చక్రసేనుడి సూచనల మేరకు, వీరసేనుడు తన ఖడ్గాన్ని ఒరలోంచి లాగి పట్టుకున్నాడు. మిత్రులిద్దరూ సొరంగం లోనికి ప్రవేశించారో, లేదో ఆయుధాలు ధరించిన పదిమంది వాళ్ళమీదికి

దాడి చేసారు! అయితే యుద్ధంలో ఆరితేరిన మిత్రులిద్దరికీ వాళ్లను తుదముట్టించటం ఏమంత కష్టం కాలేదు.

"జాగ్రత్త, మిత్రమా! ఈ సొరంగ మార్గంలో సర్పాలు కాక, వాటిని మించిన నరసర్పాలు అధికంగా ఉన్నట్లున్నాయి" అని చక్రసేనుడు అంటే, వీరసేనుడు అర్థం అయినట్లుగా నవ్వాడు.

మిత్రులిద్దరూ సొరంగ మార్గంలో ముందుకెళ్ళారు. సాధువు చెప్పినట్లుగా దారిలో వాళ్లకొక చెక్క గుర్రం, పాత ఖడ్గం దొరికాయి. మధ్యలో వారికి ఏవో చిన్న చిన్న పాములు తప్ప, మరే విష పురుగులు కూడా ఎదురవ్వలేదు!

మిత్రులిద్దరూ సొరంగపు చివరను చేరుకునేసరికి పైకి వెళ్ళే మెట్లు కనబడ్డాయి. "జాగ్రత్త!" అని ఒకరినొకరు హెచ్చరించుకొని, కత్తులు దూసి మెట్ల పైనున్న తలుపును నెట్టారు. వాళ్ళు అనుకున్నట్లుగానే ఆయుధాలు ధరించిన శత్రువుల గుంపు మరొకటి వాళ్ల మీద విరుచుకు పడ్డది! వీరసేనుడు, చక్రసేనుడు మళ్ళీ తమ కత్తులకు పదును పెట్టారు: వాళ్ళనందరినీ సునాయాసంగా యమపురికి పంపారు.

దేవాలయంలోకి చేరుకోగానే వాళ్లకు ధ్యానంలో ఉన్న సాధువు కనిపించాడు. వీరసేనుడు, చక్రసేనుడు చిరునవ్వుతో ఆయన్ని సమీపించారు. అలికిడి విని కనులు తెరచిన సాధువుకు వాళ్ళు తాము సొరంగంలోంచి తెచ్చిన కీలు గుర్రాన్ని, విక్రమార్కుని ఖడ్గాన్నీ సమర్పించి నమస్కరించారు.

"అలా కాదు, పాదాలకు నమస్కరించాలి ప్రభూ!" అని మంత్రికుమారుడు అనటంతో ముందు వీరసేనుడు, ఆ తర్వాత, అతను లేచి నిలబడ్డాక చక్రసేనుడు, సాధువు పాదాలకు వంగి నమస్కారం చేశారు.

సాధువు ముఖం తెలవెలపోవటం చూసి మిత్రులిద్దరూ నవ్వుకున్నారు. వాళ్ల నవ్వుల్ని చూసిన సాధువు తటాలున తన చేతిలో ఉన్న విక్రమార్కుని ఖడ్గం తీసి మిత్రులిద్దరి మీదా విరుచుకు పడ్డాడు! సిద్ధంగా ఉన్న మిత్రులిద్దరూ అతన్ని ఎదుర్కొన్నారు.

చూడగా సాధువు గొప్ప పోరాట పటిమగల యోధుడే! వీరసేనుడు, చక్రసేనుడు ఇద్దరూ కలిసి, అతి కష్టం మీద అతన్ని యమపురికి పంపారు! అతను మరణించాక, పెట్టుడు మీసాలూ, గడ్డమూ, తొలగించి చూస్తే అతను మరెవరో కాదు- ప్రతాపపురపు సేనాని!



ప్రతాపపుర సేనాని రాజును, యువరాజును ఇద్దరినీ చంపి రాజ్యాన్ని చేజిక్కించుకోవాలని కొంతకాలంగా పన్నాగాలు పన్నుతున్నాడు. యువరాజు దేశాటనకు బయలుదేరటం చూసి అతను సాధువు వేషంలో మోసం చేయజూశాడు. అయితే అతను చేసిన తప్పులు- శివాలయంలో నంది సునాయాసంగా ప్రక్కకు తొలగటం, మిగతా ఆలయం అపరిశుభ్రంగా ఉన్నా నంది శుభ్రంగా ఉండటం, శివుని వెనకనున్న తలుపు శబ్దం లేకుండా తెరచుకోవటం, లోపల ఉన్న మనుషులు సైనికుల మాదిరి ప్రవర్తించటం- ఇవన్నీ- అతన్ని పట్టించాయి!

ఒకసారి సేనాని మరణించగానే, అతని పన్నాగంలో పాలుపంచుకున్న దుర్మార్గు-లందరూ చిక్కారు. రాజుగారు వాళ్లకు తగిన శిక్షలు విధించటంతో పాటు, తనకు అంత విలువైన బహుమతిని తెచ్చిన వీరసేనుడికి రాజ్యాభిషేకం చేశారు. చక్రసేనుడు మంత్రి అయినాడు. త్వరలోనే వీరసేనుడు ధైర్యసాహసాలు గల మంచి రాజుగాను, చక్రసేనుడు తెలివైన మంత్రిగాను పేరు తెచ్చుకున్నారు!

**ప్రార్థించే పెదవుల కన్నా పని చేసే చేతులు మిన్న!**

# తోక వాహనం

కథ: అపరాజిత కరిపినేని, 4 వ తరగతి, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా
బొమ్మ: శ్రీజ

అనగా అనగా ఒక అడవిలో ఒక కుందేలు ఉండేది. అది ఎప్పుడూ అడవి అంతా తిరుగుతూ అన్ని విషయాలల్లోనూ తల దూరుస్తూ ఉండేది.



ఒకరోజున అది ఎప్పటి లాగే అడవిలో తిరుగుతూ తిరుగుతూ- ఒక రాళ్ళ గుట్టను చూసింది. ఆ రాళ్ళ గుట్ట కిందుగా తాడులాంటిదేదో బయటికి వచ్చి ఉన్నది. కుందేలుకు దాన్ని చూస్తే ఒక రాతి బండీ- దానికి కట్టిన తాడూ గుర్తుకొచ్చాయి. "తాడును పట్టుకొని లాగితే ఎంచక్కా బండి ఇవతలకి వస్తుంది!" అని దాన్ని లాగేందుకు ప్రయత్నించింది అది. అయినా ఆ తాడు ఏమాత్రం కదలలేదు!

"వేరే ఎవరైనా సాయం వస్తారేమో, చూద్దాం" అని అడవిలోకి పరిగెత్తింది కుందేలు. కొంచెం దూరం వెళ్ళేసరికి దానికి ఒక పులి కనిపించింది:

"పులీ! పులీ! నేను ఒక బండిని చూశాను. ఒక్కదాన్నే లాగలేకపోతున్నాను. కాస్త సాయం చేస్తావా, ప్లీజ్!?" అడిగింది కుందేలు.

పులి కొంచెం ఆలోచించింది. "సరే పద" అంటూ కుందేలుతో కలిసి రాళ్ళ గుట్ట దగ్గరకి వచ్చిందది. గుట్ట క్రిందుగా బయటికి వచ్చిన తాడును పట్టుకుని శక్తి కొద్దీ లాగింది పులి. అయినా తాడు బయటికి రా లేదు. "ఊహు! కదలడం లేదు. నువ్వెళ్ళి ఇంకెవరినన్నా పిలుచుకురా" అన్నదది చివరికి.

కుందేలు మళ్ళీ అడవిలోకి పరిగెత్తింది. ఎదురుగా వస్తున్న నక్కని ఆపి "నక్కా! నక్కా! నేను ఒక బండిని చూశాను. దాన్ని నేనూ, పులీ ఇద్దరమూ లాగలేకపోతున్నాము. కొంచెం సాయం వస్తావా?! " అని అడిగింది.



"సరే పద" అంటూ కుందేలుతో కలిసి రాళ్ళ గుట్ట దగ్గరకి వచ్చింది నక్క. తాడుని పులి-పులి తోకని నక్క- రెండూ బలం కొద్దీ లాగాయి. ఊహు.. తాడు కదలనే లేదు!

"కదలడం లేదమ్మా కుందేలూ! నువ్వెళ్ళి ఇంకొకరిని ఎవరినైనా పిలుచుకురారాదూ?" అంది నక్క, ఆయాసంతో వగరుస్తూ.

కుందేలు మళ్ళీ అడవిలోకి పరిగెత్తింది. ఎక్కువ దూరం పోకనే దానికి చెట్టుపైన గెంతుతున్న కోతి ఒకటి కనిపించింది.

"కోతీ! కోతీ! నాకు చక్కని వాహనం ఒకటి కనబడ్డది- రాళ్ళ గుట్ట క్రింద. నేను ఒక్కదాన్నీ బయటకి లాగలేక, పులిని సాయానికి పిలిచాను. పులి కూడా లాగలేకపోతే నక్క సాయం వచ్చింది. అయినా ఆ వాహనం బయటకి రావడం లేదు. నువ్వు కూడా వచ్చి సాయం

చేయరాదూ, ప్లీజ్!" అని అడిగింది కుందేలు.

"వాహనమా! భలే భలే. ఎందుకు సాయం చేయనూ? పనేమీ లేక ఇందాకటి నుంచీ ఊరికే అటూ ఇటూ గెంతులేస్తున్నాను. పద పద" అంది కోతి గెంతుతూ.



అట్లా కోతి వెళ్ళి నక్క తోకని పట్టుకున్నది. మూడూ ఎంతలాగినా తాడు మాత్రం కదల్లేదు.

"ఊ..ఉహు! కదలడం లేదు. నువ్వెళ్ళి ఇంకోళ్ళని వెంటబెట్టుకురా" అన్నదది కుందేలుతో.



కుందేలు మళ్ళీ అడవిలోకి పరిగెత్తింది. ఈసారి అది నేరుగా ఎలుగుబంటు గుహ దగ్గరకి వెళ్ళి విషయం చెప్పింది.

"సరే పద" అంటూ ఎలుగుబంటు వచ్చి కోతి తోకని పట్టుకుని లాగింది. ఆ దెబ్బకి రాళ్ళ గుట్టలో నుండి ఇవతలకి ఒక్కసారిగా ఏదో దబ్బున పడింది.

తీరా చూస్తే అది ఒక ఏనుగు!

అది కోపంగా అన్ని జంతువులను చూస్తూ

"ఎవరు, నా తోకని లాగింది?!" అంది.

అన్నీ కుందేలు వైపు చూశాయి. ఇక అక్కడుంటే ప్రాణాలు పోతాయనుకున్న కుందేలు "క్షమించండి. నేను మీ తోకని చూసి రాతి వాహనానికి కట్టిన తాడు అనుకున్నాను" అన్నది, పరుగు లంకించుకుంటూ.

బిత్తరపోయిన ఏనుగును అలాగే వదిలేసి కుందేలు వెనకే పరుగుతీసాయి, దానికి సాయం వచ్చిన జంతువులన్నీ!!

నవ్వు!

**చాక్‌పీసు ప్రేమ!**

లెక్కల అయ్యవారు: పిల్లలూ! ఈ అభ్యాసంలో ఎన్ని లెక్కలు ఉన్నాయి?

గోపి: చాలా ఉన్నాయి సార్!

లెక్కల అయ్యవారు: మరయితే ఒక్క లెక్క చేస్తువురా, గోపీ

గోపి: ఒక్క లెక్క కాదు సార్, అన్ని లెక్కలూ ఒకేసారి చేస్తా. బోర్డు తక్కువ అయినా పర్లేదు; చాక్‌పీసులు మాత్రం ఎక్కువగా ఇప్పించండి సార్!

**తొందర!**

రాము: త్వరగా ఇంగ్లీషు నేర్చుకునేందుకు పుస్తకం ఏదైనా ఉందా?

గోపి: ఉందిరా! 30 రోజుల్లో ఆంగ్లం నేర్చుకోండి అని ఒక పుస్తకం ఒకటి చూశాను దుకాణంలో.

రాము: అయితే అట్లాంటివి మూడు పుస్తకాలు పట్టుకొస్తావా, ప్లీజ్?!

గోపి: అన్ని పుస్తకాలు ఎందుకురా?

రాము: మూడు పుస్తకాలుంటే పదిరోజుల్లో నేర్చుకోవచ్చు గదరా, పరీక్షలు పదిరోజుల్లో వస్తున్నాయి మరి!

*- ZPHS గుండువారిపల్లి విద్యార్థులు*





# తోడేలుతో స్నేహం

*మంచివాళ్లతో స్నేహం మేలు చేస్తుంది. మరి చెడ్డవాళ్ళతో స్నేహం..? ఇదిగో ఈ కథ చదవండి తెలుస్తుంది.*

*రచన: జలంపెల్లి సందీప్, నాలుగవ తరగతి, ప్రభుత్వ ప్రాధమికోన్నత పాఠశాల, టేకుమట్ల, జైపూర్ మండలం, ఆదిలాబాదు జిల్లా* *పున: కథనం: కొత్తపల్లి*

అనగా అనగా ఒక అడవిలో ఒక మేక-మేకపోతుల కుటుంబం ఉండేది. వాటికి రెండు చిట్టి చిట్టి మేక పిల్లలు ఉండేవి. మేకకు, మేకపోతుకు తమ పిల్లలంటే చాలా ఇష్టం. ఎప్పుడేగాని వాటిని ఒంటరిగా వదిలి ఎక్కడికీ పోయేవి కావు.

అయితే మేకపోతుకు అడవిలో ఒక తోడేలుతో స్నేహం కుదిరింది. కండలు తిరిగిన శరీరంతో, బలంగా ఉండే మేకపోతుకు తోడేలంటే ఏమాత్రం భయం ఉందేది కాదు. కానీ తల్లి మేక మటుకు దాన్ని చూస్తే చాలా భయపడేది.

"నీకెందుకు, దాంతోటి స్నేహం?! అది తోడేలు, మనది మేక జాతి. మనకు, దానికి

పొసగదు" అనేది అది.

"ఈ తోడేలు అని తోడేళ్లలాంటిది కాదు- చాలా మంచిది. అయినా అది నన్నేం చేస్తుంది, గట్టిగా ఒక్క కుమ్ము కుమ్మానంటే చచ్చి ఊరుకుంటుంది" అనేది తప్పిస్తే, మేకపోతు దానితో స్నేహం మాత్రం మానేది కాదు.

ఒకసారి మేక మేతకి వెళ్తూ అనుమానం కొద్దీ పిల్లలతో "చూడండి! నేను మేతకి వెళ్తున్నాను. నేను, మీ నాన్న కాక ఎవరొచ్చినా మీరు మాత్రం బయటికి రాకండి" అని చెప్పింది.

అది అటు వెళ్లగానే మేకపోతు తోడేలుతో కలిసి బయటికి వెళ్ళింది. కొంత సేపటి తర్వాత అవి దాగుడు మూతలు ఆడుకున్నాయి. ఆటలో భాగంగా ఎక్కడో దాక్కున్నది తోడేలు. ఆ తర్వాత ఎంత వెతికినా అది మేకపోతుకు కనబడనేలేదు.

నిజానికి జరిగిందేంటంటే, దాక్కున్నట్లు దాక్కుని, తోడేలు మేక పిల్లల దగ్గరికి వచ్చింది. మేకపోతు లాగా "నేనొచ్చేశా" అనేసరికి, మేకపిల్లలు రెండూ బయటికి వచ్చాయి! తోడేలు వాటిని చంపి తినేసింది!

తోడేలుకోసం వెతికీ వెతికీ వేసారిన మేకపోతు ఇంటికి వచ్చి చూస్తే ఏముంది?! పిల్లలు రెండూ లేవు! "అది తోడేలు పనే"నని గ్రహించిన మేక-మేకపోతు వెళ్ళి తోడేలును నిలదీసాయి. "మిత్రుడిలా నటించి, ఇలా చేస్తావా?!" అన్నది మేకపోతు, కళ్ల నీళ్ళు పెట్టుకొని.



"నేను నీ స్నేహితుడిని ఎందుకవుతాను? నేను తోడేలును, నీది మేక జాతి. నీకూ నాకూ ఎట్లా పొసగుతుంది?! నేను ఊరికే అట్లా నటించానంతే!" అన్నది తోడేలు, కోరలు చాపుతూ.

'మోసకారి స్నేహితుడిని నమ్మి, కన్న బిడ్డలను చంపుకున్నానే' అని చాలా బాధ పడింది మేకపోతు.



# సోమరిపోతు రాజయ్య

*సేకరణ: పివిఆర్ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల గుండువారి పల్లి విద్యార్థి (పేరు రాయలేదు), తలుపుల, అనంతపురం జిల్లా*

రామాపురంలో రాజయ్య అనే రైతు ఒకడు ఉండేవాడు. అతను ఒట్టి సోమరిపోతు. ఏ పని చేయాలన్నా అతనికి బద్ధకం అడ్డు వచ్చేది. మిగతా రైతులందరూ కష్టపడి పని చేస్తుంటే రాజయ్య మాత్రం ఒళ్ళు కదలకుండా కూర్చొని "ఒరేయ్! ఎందుకురా అంత కష్టపడతారు? నన్ను చూడండిరా! రాజాలా ఎలా ఉన్నానో! మీరేంటిరా ఇలాగ?! అస్సలు సుఖపడటం తెలీదురా, మీకు" అని వాళ్ళని ఎగతాళి చేసేవాడు. వాళ్లెవ్వరూ ఇతని మాటల్ని పట్టించుకునేవాళ్ళు కాదు.

రాజయ్య రెండు పనులు మటుకు క్రమం తప్పకుండా చేసేవాడు: నిద్రపోవటం, తిండి తినటం. రాజయ్యకు ఏమిచ్చినా ఇవ్వకపోయినా దేవుడు లెక్కలేనంత నిద్ర,

చెప్పలేనంత ఆకలి ఇచ్చాడు. నిద్ర, ఆకలి తీరాక, గుర్తొచ్చినప్పుడల్లా రాజయ్య దేవుడిని ప్రార్థించేవాడు: "దేవుడా! ఇంత పని చేసుకోలేక కష్టపడుతున్నాను- నాకొక్క సేవకుడిని పంపించరాదా?!" అని.

ఒకసారి దేవుడనుకున్నాడు- 'వీడికి గుణపాఠం నేర్పించాలి' అని. వెంటనే రాజయ్యముందు ఒక సేవకుడు వచ్చి నిలబడ్డాడు. "అయ్యా! నన్ను దేవుడు పంపించాడు. మీరు నా శక్తికి తగిన పని ఏది చెబితే అది చేయమన్నాడు. నాకు భోజనం, వసతి మీరే ఇస్తారని చెప్పాడు" అన్నాడు.

"ఓహో అట్లా చెప్పాడా! సరే, మంచిది. మరయితే నాకు రెండెకరాల పొలం, బావి ఉన్నాయి. వాటిలో నీకు తోచిన పంటలు వెయ్యి! లాభంగా వ్యవసాయం చెయ్యాలి సుమా!" అని సంతోషంగా అతనికి పని అప్పగించేశాడు రాజయ్య.

అయితే ఆ సేవకుడు పొలంలో ఏ పంటా వెయ్యలేదు. పైపెచ్చు రాజయ్య గట్టిగా ఏదైనా పని చెబితే "ఇది నా శక్తికి మించిన పనండి! దేవుడు నా శక్తికి తగిన పని చెబితే చేయమన్నాడు తప్ప, శ్రమపడమని చెప్పలేదు" అనటం మొదలెట్టాడు.

వాడికి వంట చేసి పెట్టటమూ, వాడి అవసరాలు తీర్చటమూ, వాడిచేత పని చేయించటం తోటే రాజయ్యకు తల ప్రాణం తోకకు రాసాగింది.



ఒకనాడు "ఇదిగో! ఈ ఎద్దుల జతను తీసుకెళ్ళి పొలం దున్ను!" అని సేవకుడికి చెప్పి ఇంటికొచ్చేశాడు రాజయ్య.

సేవకుడు పొలం దున్నుతుంటే అతనికి రెండు

లంకె బిందెలు దొరికాయట! కానీ అతను వాటిని రాజయ్యకు ఇవ్వకుండా తనే దాచేసుకున్నాడు. అయితే ప్రక్క పొలంలో దున్నుతున్న రైతు ఈ సంగతిని గమనించి చెబితే, రాజయ్య సేవకుడిని నిలదీశాడు: "అవును! దొరికాయి! అయితే ఏంటట?" అన్నాడు వాడు దురుసుగా.

"నా పొలంలో దొరికితే అవి నావి!" అన్నాడు రాజయ్య.

"నాకు ఆ సంగతి తెలీదు. నాకు దొరికినవన్నీ నావే- అసలు పని చేస్తున్నది నేను-కూర్చొని తినేది మీరు! ఇది ఎలా కుదురుతుందండీ! అయినా ముందు నాకు ఆకలేస్తున్నది. ఊరికే తగవులాడటం మాని అన్నం పెట్టండి!" అన్నాడు సేవకుడు.

"మర్యాదగా నా బిందెలు నాకు ఇవ్వకపోతే కొత్వాలు దగ్గర ఫిర్యాదు చేస్తాను, జాగ్రత్త" అని బెదిరించాడు రాజయ్య.

"అవి మా లోకంలో నడవవండి! అయినా ఏం చెప్పుకుంటారో చెప్పుకోండి, భూమిలో దొరికినవి రాజుకు చెందుతాయని చెప్పి వాటిని రాజుగారికి అప్పజెబుతాను" అన్నాడు సేవకుడు.

"దేవుడా!నాకు ఇట్లాంటి సేవకుడిని పంపావేమి?! వీడిని తీసుకెళ్ళిపో!" అని మొత్తుకున్నాడు రాజయ్య.



దేవుడు ప్రత్యక్షమై, "మరి నువ్వేగా, 'సేవకుడు కావాలి' అని ఒకటే వేధించింది?!" అన్నాడు.

"ఇట్లాంటివాడినా, నాకిచ్చేది?" అన్నాడు రాజయ్య.

"చూడు రాజయ్యా! మనుషులన్నాక ఎవరి ప్రవృత్తులు వాళ్లకు ఉంటాయి. పనిచేసే వాళ్ళే గొప్పవాళ్ళు- మిగిలినవాళ్ళు వాళ్లతో

సర్దుకుపోతుండాలి, అంతే. నీకు అక్కర్లేకపోతే నువ్వు సేవకుడిని పెట్టుకోకు!" అన్నాడు దేవుడు.

"నాకు అక్కర్లేదు!" అని రాజయ్య అనగానే సేవకుడు కాస్తా మాయం అయిపోయాడు. లంకెబిందెలూ అతనితోబాటే మాయం!

రాజయ్య మళ్ళీ మొత్తుకున్నాడు.

దేవుడు నవ్వి "రాజయ్యా! ఇదిగో, ఈ చీమల్ని చూడు- ఎంత కష్టపడి తమ ఆహారాన్ని తాము సంపాదించుకుంటున్నాయో! కష్టపడితేనే ఫలం; లేకుంటే ఏమీ లేదు. అక్కడ చూడు, పిల్లలు ఎంత శ్రమపడి చెట్లమీద పండ్లను కోసుకుంటున్నారో! పళ్ళు వాళ్ల దగ్గరికి వచ్చి రాలి పడాలంటే పడవు మరి! ఊరికే వచ్చిన సేవకులతో పని చేయించుకొని హాయిగా బ్రతకాలనుకోవటం తప్పు. నీ శ్రమకు తగిన పని నువ్వు చేయటమే సరైనది!" అన్నాడు, మాయమైపోతూ.

"బుద్ధి వచ్చింది- ఇకనుండి బాగా పనిచేస్తాను స్వామీ" అని లెంపలేసుకున్నాడు రాజయ్య.

అటు తర్వాత రాజయ్య మిగిలిన రైతుల్లాగా కష్టపడి పనిచేస్తే అందరూ ఆశ్చర్యపోయారు.

అటుపైన ఇక 'సోమరిపోతు రాజయ్య' లేడు- అతనికి ఇప్పుడు 'శ్రమజీవి రాజయ్య ' అని మంచి గుర్తింపే వచ్చింది!

కవిత

వసంతం తెచ్చింది ఉగాది।
కావాలి నూతన విజయాలకిది పునాది॥
శ్రీ జయనామ సంవత్సరమిది।
నవశకానికి కావాలి నాంది॥
విజయకాంక్ష నింపుకోవాలి ప్రతీ మది।
ఇక గెలుపు మీదికాక మరెవరిది॥

*-ఎం. అశ్వర్థనారాయణ, గణిత సహాయకులు, ZPHS, గుండువారిపల్లి.*

పొడుపు

ముళ్ళలో పుట్టాను
ముళ్ళలో పెరిగాను
రంగూ వాసన నాసొత్తు
ఎవరిని, నేనెవరిని?

*జవాబు: గులాబీ*

*-టి. సునీల, 8వతరగతి, గుండువారిపల్లి.*

# కాకమ్మ-గువ్వమ్మ

అనంతపురం జిల్లా జానపద కథ

*కథనం: పి. తిరుపాల్, 9 వతరగతి, z.p.h.s ముష్టికోవెల, అనంతపురం జిల్లా.*



అనగనగా ఒక అడవిలో ఒక కాకమ్మ, ఒక గువ్వమ్మ ఉండేవి. కాకమ్మదేమో రాళ్ళ ఇల్లు. గువ్వమ్మదేమో పేడ ఇల్లు.



ఒకనాడు సాయంత్రం పే..ద్ద గాలివాన వచ్చింది. దాంతో గువ్వమ్మ కట్టుకున్న పేడ ఇల్లు కాస్తా కరిగిపోయింది.



అప్పుడు గువ్వమ్మ కాకమ్మ ఇంటికి వెళ్ళి "కాకమ్మా, కాకమ్మా! కొంచెం తావిస్తావా?" అంది. అంటే, అప్పుడు కాకమ్మ "ఉండమ్మా గువ్వమ్మా! ముందు నా మొగోనికి నీళ్లు పోయాలి" అనింది.

తరువాత కొంచెం సేపటికి మళ్ళీ వెళ్ళి "కాకమ్మా, కాకమ్మా! కొంచెం తావిస్తావా, ఇప్పుడు?" అని అడిగింది గువ్వమ్మ. "ఉండమ్మా, గువ్వమ్మా! ముందు నా మొగునికి బట్టలు వెయ్యాలి" అనింది కాకి.



తరువాత కొంచెం సేపటికి మళ్ళీ వెళ్ళింది గువ్వమ్మ. "కాకమ్మా, కాకమ్మా! కొంచెం

తావిస్తావా?" అంటూ.

"ఉండమ్మా, గువ్వమ్మా! ముందు నా బిడ్డను స్కూలుకి విడిచిరావాలి" అని కాకి అనింది.



కొంచెం సేపు తరువాత మళ్ళీ వెళ్ళింది గువ్వమ్మ "కాకమ్మా, కాకమ్మా! కొంచెం తావిస్తావా" అంటూ.

అప్పుడు ఇంక కాకమ్మ అంది- "సరేలే, అదిగో ఆ ఇంట్లో ఉండు" అని ఇల్లు చూపించింది. ఆ ఇంట్లో బిస్కెట్లు, చక్కిలాలు, నిప్పట్లు, లడ్డు, బూంది, మిక్చర్- అన్నీ ఉన్నాయి. గువ్వమ్మ ఆ ఇంట్లో చేరుకొని అవన్నీ తినేసింది.

అంతలో కాకమ్మ బిడ్డ వచ్చి "అమ్మా నాకు మిక్చర్ కావాలి" అన్నది. కాకమ్మ వెళ్ళి చూస్తే గిన్నెలన్నీ ఖాళీ! మిక్చర్, బిస్కెట్లు, చక్కిలాలు ఏమీ లేవు!





"ఓహో గువ్వమ్మ అన్నీ తిని పారిపోయిందే" అని దాన్ని వెతుక్కుంటూ వెళ్ళింది కాకమ్మ. కానీ గువ్వమ్మ అసలు ఆ దగ్గర్లో లేనే లేదు!

అంతలో కాకమ్మకు ఒక ఒంటెద్దు ఆయప్ప ఎదురయ్యాడు. "మా గువ్వమ్మను చూస్తివా చిన్నాయప్పా?" ఆని కాకమ్మ అడిగింది ఆయన్ని.

"లేదమ్మా! రెండెద్దుల ఆయప్పను అడుగు" అన్నాడు ఒంటెద్దు ఆయప్ప.



రెండెద్దుల ఆయప్పని అడిగింది కాకమ్మ. "అదిగో చూడమ్మా! ఆ గట్టు మీద ఉంది" అని దారి చూపించాడు రెండెద్దులాయప్ప.

అప్పుడు కాకమ్మ అక్కడికి వెళ్ళి గువ్వమ్మను పట్టుకొని, ఇంటికి తీసుకువెళ్ళి, కడ్డీ కాగబెట్టి వాత పీకింది. దాంతో గువ్వమ్మ ఇంక ఎవ్వరికీ కనబడకుండా పారిపోయింది.



# సోమయ్య నిజాయితీ

*రచన: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా.*

శివపురంలో నివసించే రామయ్య వెదురుని వేణువుగా మలచడంలో బహునేర్పరి. తన కుమారులైన వీరయ్య, సోమయ్యలకి కూడా ఆ విద్యను నేర్పించాడు రామయ్య. కొడుకులిద్దరూ విద్య పట్ల చూపించే శ్రద్ధను చూసి అతను ఎంతగానో మురిసిపోయేవాడు. కానీ రానురానూ పెద్ద కొడుకు వీరయ్యలో వస్తున్న మార్పుని చూసి అతనికి బాధ మొదలైంది. చిన్నప్పుడు మంచిగానే ఉన్న వీరయ్య, సంపద పెరుగుతున్న కొద్దీ డబ్బు మీద ఆశతో స్వార్థజీవిగా, దురాశాపరుడిగా మారసాగాడు. మొదట్లో వేణువుని చూసిన అతను, ఇప్పుడు వేణువు ద్వారా వచ్చే ధనాన్ని చూస్తున్నాడు. తను తయారు చేసిన వేణువు పలికించే సంగీతం మీది కంటే ఆ వస్తువు పలికే ధరమీదే అతని మనసు ఉండేది.

కొడుకులో వస్తున్న మార్పుని గమనించిన రామయ్య 'అతనిలో మార్పు రావాలంటే

మంచి సంస్కారం, గుణం ఉన్న ఉత్తమురాలైన అమ్మాయితో వివాహం జరిపించడమే మార్గం' అని తలచి, జానకితో అతని వివాహం జరిపించాడు. జానకి సహనశీలి, గుణవంతురాలే కాదు, మానవత్వం మూర్తీభవించిన మంచి మనిషి. జానకితో వివాహం జరిగాకైనా వీరయ్యలో మార్పువస్తుందనుకున్న రామయ్యకు నిరాశే మిగిలింది.

అయితే చిన్నకొడుకు సోమయ్య మాత్రం తన శ్రమతోటీ,ఇష్టంతోటీ తండ్రి నేర్పిన విద్యకు మరింత మెరుగుదిద్ది, తండ్రిని మించిన కళాకారుడిగా పేరు తెచ్చుకున్నాడు. 'వేణువు చేస్తే సోమయ్యే చెయ్యాలి' అని ప్రజలందరూ అతన్ని మెచ్చుకునేవారు. సోమయ్య మాత్రం ఆ పొగడ్తలేవీ పట్టించుకోకుండా తన పనేదో తాను చూసుకునేవాడు. అయితే కేవలం కళ కోసమే వేణువుని మలిచే సోమయ్య, తన కళ ద్వారా ఎక్కువ ఆదాయాన్ని సంపాదించుకోలేకపోయాడు. సంపాదించిన కొంత మొత్తాన్నీ తండ్రికో, అన్నకో ఇచ్చేసేవాడు.



వయసు పైబడుతున్న కొద్దీ రామయ్య చింతకు చిన్న కొడుకు గురించిన చింత కూడా తోడైంది. తాను లేకుంటే పెద్దవాడు వీరయ్య అమాయకుడైన చిన్నకొడుకును మోసం చేస్తాడన్న దిగులుతోటే అతను మంచం పట్టాడు. చివరికి అతను ఒక నిర్ణయానికొచ్చి, కొడుకులిద్దరినీ పిలిచాడు:

"నాయనలారా, నాకు మృత్యు ఘడియలు సమీపిస్తున్నాయి. వీరయ్యా, ఇదిగో ఈ బంగారం తీసుకో. నువ్వు దీన్ని వృద్ధిచేయగలవని నాకు తెలుసు. ఇక పోతే

సోమయ్యా, నేను వేణువులుగా మలుద్దామని తెప్పించిన వెదురు బొంగులివి. నీకు జీవితంలో బ్రతకడానికి ఏ దారీ లేనప్పుడు వీటిని వేణువులుగా మలిచి సంపాదించుకో. ఇక పోతే, ఈ ఇల్లు- దీన్ని రెండు భాగాలుగా చేసి, సమానంగా పంచుకోండి: కానీ విడిపోకండి. ఇద్దరూ ఎప్పుడూ కలిసే ఉంటామని మాట ఇవ్వండి. అమ్మా జానకీ, వీళ్లిద్దరినీ కలిపిఉంచే భాధ్యత నీదే తల్లీ!" అని చెప్పి కన్ను మూశాడు.



తండ్రి తనకు బంగారం ఇచ్చి, తన తమ్ముడికి వెదురు బొంగులను ఇచ్చినందుకు పెద్దవాడు మొదట సంతోషించినా, ఆ తర్వాత అందులో ఏదైనా మతలబు ఉందేమోనన్న అనుమానం మొదలైంది అతనికి. చివరికి ఒకరోజున తమ్ముడు ఊళ్లో లేని సమయం చూసి, అతని గదిలోకి చొరబడి, వాళ్ల నాన్న ఇచ్చిన వెదురుముక్కల పెట్టెను తీశాడు; అందులోఉన్న వెదురు ముక్కలతోపాటు తమ్ముడు దాచుకున్న చిల్లరనాణేలను కూడా దొంగలించాడు. ఆ వెదురు ముక్కలను చీల్చేసరికి ఆరు వజ్రాలు బయటపడ్డాయి!

తండ్రి తనను మోసగించాడని వీరయ్యకు చాలా కోపం వచ్చింది. తమ్ముడికి వజ్రాలిచ్చి, తనకు బంగారం మాత్రమే ఇవ్వటం మోసమే గద! అందుకని 'ఆ వజ్రాలు తనవే' అన్న నిర్ణయానికి వచ్చాడతను. అయితే వాటిని దాచుకునేదెలాగ? తాను వేణువుగా మలచబోయే వెదురుముక్కలలో ఒక దానిలో ఆ వజ్రాలను దాచేసి, గుర్తుగా ఉండేట్లు దాన్ని ఒక బట్టతో భద్రంగా చుట్టి పెట్టి, గమ్మున ఊరుకున్నాడు వీరయ్య.

పనినుండి ఇంటికొచ్చిన సోమయ్య తన ఇంట్లో

నిజంగానే దొంగలు పడ్డారు అనుకుని బాధ పడ్డాడు. వీరయ్య తనకేమీ తెలియనట్లు ఆశ్చర్యాన్నీ బాధనూ నటించి, చివరికి- "బాధపడకు తమ్ముడూ, పోయింది పెద్ద మొత్తమేమీ కాదు కదా, ఇక వెదురు ముక్కలంటావా, నావి నీవి కాదా?" అని సముదాయించాడు మాట వరసకు.

అయితే ఆ మర్నాడు ఆ ఊరి పూజారి సోమయ్య ఇంటికొచ్చి- "సోమయ్యా, మన గ్రామంలో కృష్ణుని దేవాలయం పూర్తి కావొస్తోంది. విగ్రహం తయారీ కూడా దాదాపు పూర్తయింది. ఇక మిగిలింది ఆ వేణువు మాత్రమే- అతి సుందరమైన వేణువుతో ఆ బాల గోపాలుణ్ణి వేణు గోపాలునిగా మార్చే బాధ్యత నీదే. నువ్వు గుడికి వచ్చి, దైవ సన్నిధిలో ఆ పనిని పూర్తి చేస్తే దేవుడితో పాటు, మేం అందరమూ కూడా సంతోషిస్తాము. మరి త్వరగా రా!" అంటూ వెళ్ళిపోయాడు.

అది విని సోమయ్యకు ఏడుపు వచ్చింది- "చూసావా, వదినా?! నా దగ్గర అన్నీ ఉన్నప్పుడు ఆ దేవుడు నన్ను పిలవలేదు. ఈ రోజున నా దగ్గర ఏమీ లేనప్పుడు, ఎలా తొందర పెడ్తున్నాడో చూడు. నేను ఏం చెయ్యను? నా దగ్గర ఉన్న వెదురు బొంగులన్నీ దొంగలు ఎత్తుకు పోయారు కదా?!" అని వదిన జానకితో చెప్పుకొని బాధపడ్డాడు.



"నాయనా! నువ్వేమీ బాధపడకు- నిన్న మీ అన్నగారు ఏమన్నారో మరిచిపోయావా? 'నా దగ్గరున్న వెదుర్లు నీవి' అని చెప్పలేదూ?! ఉండు- నేనిప్పుడే నీక్కావలసిన చక్కని వెదురును నీకు తెచ్చి ఇస్తాను" అని పోయి, వీరయ్య సామాన్లలో వెతికింది. వాటిలో ఒకటి భద్రంగా, మంచి బట్టతో చుట్టి- ఉన్నది.

"ఇంత జాగ్రత్తగా దాచారంటే- ఇది మంచి వెదురై ఉంటుంది. ఇలాంటి వెదురుతో వేణువుని చేసి దేవుడికి ఇస్తే పుణ్యం!' అని జానకి సంతోషంగా దాన్ని తెచ్చి సోమయ్యకిచ్చి, ఆశీర్వదించి పంపింది.

సోమయ్య ఆ వెదురు ముక్కను తీసుకొని నేరుగా గుడికెళ్లి, దేవుడి ముందు కూర్చొని వెదురును మలచడం ప్రారంభించాడు. అంతలోనే అందులోంచి తళతళా మెరుస్తూ, వజ్రాలు రాలి పడ్డాయి!

మొదట ఆశ్చర్యపోయిన సోమయ్య, అటుపైన ఆ వజ్రాలను జాగ్రత్తగా తీసి దాచి, తిరిగి వేణువుని చెయ్యడంలో నిమగ్నమయ్యాడు. తాను పూర్తి చేసిన చక్కని వేణువును పూజారిగారి చేతిలో పెట్టాడు. పూజారి అతని పనితనాన్నీ, కళపై అతనికున్న ప్రేమనూ మెచ్చుకుని, అతనికి కొన్ని వెండి నాణేలను కానుకగా ఇచ్చి పంపాడు.

ఆలోగా పక్కగ్రామానికి పనిపడి వెళ్లిన వీరయ్య ఇంటికి తిరిగొచ్చి భార్య మీద అంతెత్తున ఎగిరాడు- "అందులో ఏమున్నాయో తెలుసా?" అని అరుస్తూ.

అంతలోనే అక్కడికి చేరుకున్న సోమయ్య, తన అంగీలోంచి వజ్రాలను తీసి అన్నకిస్తూ "అన్నా, ఇవిగో నీ వజ్రాలు. నువ్వు వీటిని ఆ వెదురులో దాచావని తెలియక, వదినమ్మ దాన్ని నాకు ఇచ్చింది- ఇవిగో, ఇవేమో పూజారిగారు ఇచ్చిన వెండి నాణేలు!" అంటూ వజ్రాలతోపాటు, వెండినాణేలను కూడా వీరయ్యచేతిలో పెట్టాడు అమాయకంగా.



తమ్ముడి నిజాయితీనీ, మంచితనాన్నీ, అమాయకత్వాన్నీ చూసిన వీరయ్యలో

పశ్చాత్తాపం కలిగింది. తమ్ముడిని మోసం చేసినందుకు బాధ మొదలయింది. భార్య చూపించినంత వాత్సల్యాన్ని కూడా తాను తన తమ్ముడిపై చూపించలేకపోయినందుకు సిగ్గుపడ్డాడతను. వెంటనే ఆ వజ్రాలనూ, వెండి నాణేలనూ తమ్ముడి చేతిలో పెట్టి- "తమ్ముడూ, నన్ను క్షమించు. ఇవన్నీ నీవే" అన్నాడు ప్రేమగా.

భర్త ఏం చేశాడో చూసిన జానకి, అతనిలో వచ్చిన మార్పుకు సంతోషించింది. అటుపైన అన్నా తమ్ముళ్లిద్దరూ కలసి మెలసి సంతోషంగా జీవించారు.

పొడుపు!

భూమాతకు ముద్దుబిడ్డ
ఆకాశం నా జున్ను గడ్డ
రాత్రివేళ రాచరికం
పగలైతే పేదరికం
ఎవరిని , నేనెవరిని? జవాబు: చందమామ

అయ్యా అంటే కలవం
అమ్మా అంటే కలుస్తాం
ఎవరిమి, మేమెవరిమి?
జవాబు: పెదిమలు

ఆలులేని అడవిలో
జీవంలేని జంతువు
జీవంగల జంతువులతో పోరాడింది
ఏమా కథ? ఎవరిదా కథ?
జవాబు: తల, దువ్వెన, పేన్లు.

ఆకాశానికి పోటు
సముద్రానికి మూత
ఎముక ఉన్న నాలుక
తొడిమ ఉన్న గ్రుడ్డు-
వీటన్నిటికీ పోలిక ఏంటి?
జవాబు: ఇవేవీ ఉండవు!

మా ఊళ్ళో వెలసింది
ఊరవతల తోట వేసింది
ధర్మవరం పోయినా వాసన వస్తుంది
ఏంటది?
జవాబు: మొగలి రేకు

ఆరుకాళ్ళ చిన్నవాడు
ఎంత దట్టమైన అడవినైనా
నరికేస్తాడు!
ఎవరది?
జవాబు: పేను!



# జ్ఞానోదయం

*రచన: సి.ప్రణయజ, గుంటూరు.*

అది సాయంకాల సమయం. మణిపురం గ్రామం గుండా మెల్లగా నడుచుకుంటూ వెళ్తున్నారు ఒక స్వామీజీ. దూరంగా ఒంటెద్దు బండి మీద బస్తాలు పెట్టుకొని, బండిని జోరుగా లాగడం లేదని ఎద్దును కొడుతున్నాడు ఒక రైతు. స్వామీజీ పరుగుపరుగున వెళ్ళారక్కడకి-

"ఎందుకు నాయనా అట్లా కొడుతున్నావు ఆ మూగజీవిని?" అడిగారు ఆ రైతును.

"ఏం చెప్పను స్వామీ! చీకటి పడకముందే ఊరు చేరుకోవాలి. ఇదేమో బండిని జోరుగా లాగడంలేదు. ఊరెలా చేరుకోగలను?" అన్నాడు ఆ రైతు బాధగా.

"బండిపైన అన్ని బస్తాలు బరువు పెడితే, పాపం ఆ జీవి ఎలా లాగగలదు? కొంచెం బరువు తగ్గించాల్సింది!" అన్నారు ఆయన, ఎద్దువైపు

జాలిగా చూస్తూ.

"కొన్ని బస్తాలు తగ్గిస్తే ఎక్కడ పెట్టాలి స్వామీ? ఈ ఊళ్లో నాకు తెలిసిన వాళ్ళు ఎవ్వరూ లేరు. అయినా ఇన్ని సార్లు తిరగాలంటే కష్టం కదా!" అన్నాడు రైతు, నిస్సహాయంగా.



"సరేలే! మరి నువ్వు బండిని నడుపు; నేను గట్టిగా వెనక నుండి తోస్తుంటాను" అని, ఒంటి పైన కప్పుకున్న గుడ్డను నడుముకు గట్టిగా బిగించి కట్టుకున్నారు స్వామీజీ.

"తప్పు స్వామీ! నేను మీతో పని చేయించు-కుంటానా?" అన్నాడు రైతు, స్వామీజీ కాళ్ళమీద పడుతూ.

"నాయనా! నేను నీకు పనిచేయడంలేదు. ఆ మూగజీవికి తోడ్పడుతున్నాను. నువ్వు ఆలోచించవద్దు- కదులు- సమయం దాటిపోతున్నది" అని వెనకనుండి బండిని బలంగా నెట్టడం ప్రారంభించారు స్వాములవారు.

రెండు గంటల తర్వాత రైతు ఇంటికి చేరుకున్నారు వాళ్ళు.

స్వామీజీని చూసిన రైతు భార్య కంగారు పడింది- "ఏందయ్యా స్వామీజీతో బండి నెట్టించావు. మనకు పాపం చుట్టుకుంటుంది!" అంది భయంగా.

"నేను అదే చెప్పానే! అయినా స్వామీజీ వినలేదు. ఇవాళ్ల స్వాముల వారు మనింట్లోనే ఉంటారు. మంచి భోజనం తయారు చెయ్యి" అంటూ స్వామీజీకి కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు తెచ్చి ఇచ్చాడు రైతు. అతని భార్య నులకమంచంపైన మంచి దుప్పటి వేసి, లోటాతో మంచి నీళ్ళిచ్చింది. "అమ్మా! నాకు భోజనం వద్దు- ఏదైనా పండు ఉంటే ఇవ్వు" అన్నారు స్వామీజీ, ఆమెతో. పండ్లు తిని, ఆ

రాత్రి అక్కడే గడిపి, మరుసటి రోజున మరో ఊరికి ప్రయాణం అయ్యారు.

మధ్యాహ్నం అయ్యేసరికి ఆయన ఒక ఇంటిముందుకు వచ్చారు. ఆ ఇంటావిడ తన ఏడేళ్ళ కూతురును కొడుతూ కనిపించింది.



"అమ్మా! పసిబిడ్డను ఎందుకలా కొడుతున్నావు?"అంటూ ఆమె చేతిలో నుండి కర్రను తీసుకున్నారు స్వాములవారు.

"స్వామీ ఏం చెప్పను? రోజంతా వళ్ళు విరగ్గొట్టుకుంటే యాభై రూపాయలొస్తాయి. దీన్ని బియ్యం, పప్పు, నూనె తీసుకురమ్మంటే, వస్తూ వస్తూనే నూనె బుడ్డి పడేసింది. నూనె అంతా ఒలికిపోయింది. సాయంత్రానికి కూర ఎలా వండేది? నా దగ్గర డబ్బులు కూడా లేవు!" మళ్ళీ ఓసారి ఆ పాపను కసిరింది, కోపాన్ని అణుచుకోలేక.

"అమ్మా! ఈమెను కొట్టడం వల్ల ఒలికి పోయిన నూనె తిరిగి వస్తుందా?" అడిగారు స్వామీజీ.

"రాదు స్వామీ. కానీ 'కూరెలావండాలి; పిల్లలకు ఏం పెట్టాలి' అన్నదే నా బాధ. ఇది నూనె ఒలికించకుంటే ఈ బాధ ఉండేది కాదు కదా!" అని ఆ పిల్ల జుట్టు పట్టుకొని లాగిందావిడ, పళ్ళు నూరుతూ.

"కోప్పడకు తల్లీ, పసి పిల్ల మీద కోపం మంచిది కాదు" అని చెబుతూ స్వామీజీ ఆ పాప తల నిమిరారు. "పాపా! మనం చేసే పనిమీద దృష్టి పెట్టాలి. అజాగ్రత్త వల్ల నష్టాలు ఎక్కువ. ఇక మీద జాగ్రత్తగా ఉండు" అని చెప్పారు ప్రేమతో.

ఆ రాత్రికి ఆ ఊళ్లో గడిపి, మరునాడు ఇంకో ఊరికి బయలుదేరారు స్వామీజీ.

అలా నడుచుకుంటూ ఊరి చివరనున్న ఓ చెట్టుకింద సేద తీరుదామని ఆగారు. అక్కడ కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు- ఒక తొండ తోకకు దారం కట్టి, అది పారిపోకుండా లాగుతూ, చిన్న చిన్న రాళ్లతో కొడుతున్నారు. అది బాధతో అటూ ఇటూ పరుగెత్తుతూ, తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ ఉన్నది. పిల్లలంతా అరుస్తూ చప్పట్లు కొడుతున్నారు.

"పిల్లలూ! ఇలారండి" పిలిచారు స్వామీజీ పిల్లలంతా స్వామీజీ దగ్గరకు వచ్చారు.

"చూడండి, ఈ తొండకుప్రాణం ఉన్నదికదా! మీరు దాన్ని కొడుతుంటే దానికి దెబ్బ తగలదా? మిమ్మల్ని ఎవరైనా కొడితే మీకు దెబ్బ తగులుతుంది కదా? అలాగే దానికి కూడానూ. అందుకనీ దాన్ని బాధించకుండా వదిలిపెట్టండి" అన్నారు మృదువుగా వాళ్లకు నచ్చజెబుతూ.

పిల్లలు ఎప్పటినుండి ఆడుతున్నారో- ఆ ఆటమీద విసుగొచ్చి ఉంటుంది; అందుకనే స్వామీజీ చెప్పిన వెంటనే దాన్ని వదిలేశారు. బ్రతుకుజీవుడా అని పారిపోయి చెట్టెక్కేసిందది.

స్వాములవారు మళ్ళీ తన పాదయాత్ర మొదలుపెట్టారు.



ఆ సమయంలో జంబుకవర్ధనుడనే నక్క ఒకటి, స్వాముల వారిని దాటి ముందుకెళ్ళి, ఆయన్ని ఆపింది. అడవిలోని జంతువులన్నీ ఒకదానినొకటి చంపుకు తినడం చూసీ చూసీ - విసుగొచ్చింది దానికి. తన మనసు మార్చుకొని, ఎవరైనా స్వామి దగ్గర శిష్యరికం చేస్తూ సాధుజీవితం గడపాలని తిరుగుతూ, కొన్నాళ్ల క్రితం అది స్వామీజీని చూసింది. అప్పటినుండీ ఆయన్ని వెంబడిస్తూ అది

అయన వెనకాలే ఊరూరూ తిరిగింది. ఊళ్లన్నిటిలోనూ స్వామీజీ చేసిన మంచి పనులను చూసిందది. మూగ ప్రాణులకు బాధ కలగకూడదన్న స్వామీజీ సిద్ధాంతాన్ని చూసి అది పులకరించి పోయింది.

స్వామీజీ దగ్గరకెళ్లి, అది "స్వామీ, నా పేరు జంబుకవర్ధనుడు.. నేను మధురాపురం దగ్గరున్న అడవిలో తిరిగేవాణ్ణి. అక్కడి జీవహింస చూసి విసుగెత్తి పోయాను. సాధు జీవితం గడపాలని వస్తుంటే మీరు కనబడ్డారు. మీకు తెలియకుండానే మిమ్మల్ని వెంబడిస్తూ ఊళ్లన్నీ తిరిగాను. మీ జంతు ప్రేమను చూసి పునీతుడనయ్యాను. దయచేసి నన్ను మీ శిష్యునిగా స్వీకరించండి" అంటూ స్వామీజీ కాళ్ళ మీద పడ్డది.

"జంబుకవర్ధనా! సాధు జీవనం గడపటం ఏమంత సులభం కాదు. నువ్వు మాంసాహారివి. మీ అడవికి వెళ్ళు. వెళ్ళి మంచి జీవితం గడుపు, చాలు" అన్నారు స్వామీజీ.

"లేదు స్వామీ! నేను మీ చెంతనే ఉండి, మీతోనే జీవిస్తాను" అంటూ ప్రాధేయపడ్డది, నక్క. స్వామీజీ మనసులోనే నవ్వుకున్నారు.

"సరే! నీ యిష్టం!" అని నక్కను తన శిష్యునిగా స్వీకరించారు.

అలా కొంతకాలం గడిచింది. ఆకులు అలములు తినడం నక్కకు కష్టంగా ఉన్నది. అయినా ఎలాగో ఒకలాగా అలవాటు చేసుకోవాలని నిర్ణయించుకున్నదది.

ఒకరోజు స్వామీజీ ఒక అడవిగుండా వెళుతున్నారు- నక్క కూడా ఆయనను అనుసరిస్తున్నది-

అక్కడ ఒక కొలనులో కొన్ని కొంగలు జపం చేసుకుంటూ, దొరికిన చేపలను ముక్కుతో పట్టుకొని మింగుతూ కనపడ్డాయి.

నక్క స్వామీజీ వైపు చూసింది. ఆయన అదేమీ పట్టనట్లు నడుస్తున్నారు.

నక్క ఆవేశాన్ని ఆపుకోలేకపోయింది. వెంటనే కొలను దగ్గరకు వెళ్ళి "కొంగ బావలూ! అలా చేపలను చంపడం పాపం!" అంది. కొంగలు దాన్ని చూసి నవ్వాయి. నక్క మూతి ముడుచుకొని వచ్చేసింది.

ఇంకోరోజున స్వామీజీ ఎదురుగానే ఒక పాము కప్పను మింగడం కనబడింది నక్కకు. అప్పుడు కూడా స్వామీజీ పామును ఏమీ అనలేదు. నక్కకు కోపం వచ్చింది. పాము దగ్గరికి వెళ్ళి- "ఇదిగో! కప్పను మింగి జీవహింస చేయకూడదు!"అంది కోపంగా.

పాము దాన్ని చూసి ఆశ్చర్యపోయింది. "నువ్వు నక్కవు కదా, జీవహింస చేయవా?" అని నవ్వుకుంటూ తన రంధ్రంలోకి దూరింది.

మరోసారి ఒక గద్ద రయ్యిన వచ్చి కోడిపిల్లను ఎత్తుకుపోవడం చూసి, దాని వెంటే పరుగెత్తుతూ "గద్దా! కోడిపిల్లను వదిలిపెట్టు. పాపం, దానికి బాధ కలుగుతుంది" అని అరిచింది నక్క. గద్ద ఏదో చెప్పాలనుకున్నది- అయినా నోట్లో కోడిపిల్ల ఉంది కనుక మాట్లాడకుండానే ఎగిరిపోయింది. అక్కడే ఉన్న స్వామీజీ మటుకు నక్కను చూసి చిరునవ్వు నవ్వారు.

నక్క ఇంక భరించలేకపోయింది. ఎలాగైనా స్వామీజీని నిలదీయాలనుకొని- "స్వామీ! మీరు ఎంతో మంచివారని నేను మిమ్మల్ని వెంబడించాను. కాని మీ అసలు రూపం నాకిప్పుడు తెలిసింది. మీకు కొందరంటే ఇష్టం, మరి కొందరంటే ఇష్టం లేదు. అందుకే ఎద్దునూ, పిల్లనూ, తొండనూ వాటిని బాధించేవాళ్ళనుండి రక్షించారు.



మరి ఇక్కడ చేపలు, కప్పలు, కోడిపిల్లలంటే మీకు ఇష్టంలేదు. అందుకని, అవి మరణిస్తున్నా కూడా మీరు పట్టించుకోలేదు. మిమ్మల్ని ఆదర్శంగా పెట్టుకోవడం నిజంగా నా తెలివితక్కువతనం" అంటూ చెంపలు వేసుకున్నది నక్క. అయినా స్వామీజీ ఏమీ మాట్లాడలేదు.

చాలాకాలంగా తన కళ్లముందే ఎలుకలూ, పక్షి పిల్లలూ, కోడిపుంజులూ కనబడుతున్నా, వాటిని గబుక్కున మింగెయ్యాలనే కోరికను బలవంతంగా అణచుకుంటూ వస్తున్నది గదా, నక్క?! రోజూ దుంపలూ, ఆకులూ తినాలంటే దానికి బాధగానే ఉంది. చాలా నీరసపడింది కూడా. అప్పుడప్పుడూ నిద్రలో తనకు ఇష్టమైన కోడి పిల్లనో, కుందేలునో తింటున్నట్లు కలలు కూడా రావటం మొదలైంది దానికి. నక్కలో వస్తున్న మార్పును స్వామీజీ గమనిస్తూనే ఉన్నారు. ఇంకా ఎంతో కాలం అది దాని సహజ గుణాన్ని దాచుకోలేదనుకున్నారు- అయినా నక్కను ఏమీ అనలేదు ఆయన.

ఒకసారి వాళ్లిద్దరూ ఒక ఊళ్ళోకి వచ్చారు. ఆ ఊళ్ళో చాలా కోళ్ళ ఫారాలున్నాయి. ఆ ఊరికి వచ్చేసరికి స్వామీజీ ఆరోగ్యం మందగించి, ఆయన అక్కడే కొంతకాలం విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. కోళ్ళ ఫారాల నిండుగా ఉన్న కోళ్ళను రోజూ చూస్తుండేసరికి నక్క కోరికలు రెక్కలు విప్పాయి. దాని నిగ్రహం పరుగులు పెట్టసాగింది. రెండురోజులు అతి కష్టం మీద గడిచాయి.. మూడో రోజున అది మెల్లగా ఒక కోళ్ళఫారంలోకి దూరి పుంజును పట్టుకొని తిన్నది. నాలుగో రోజున రెండు. ఐదో రోజున మూడు..



అలా కోళ్ళు మాయం అవ్వటం చూసి కోళ్ళఫారం వాళ్ళు కాపు కాశారు. ఆ రాత్రి నక్క నెమ్మదిగా సందు చేసుకొని కోళ్ళఫారంలోకి దూరి ఒక కోడిని పట్టుకోగానే, మాటు వేసి ఉన్న పనివాడు దుడ్డు కర్రతో ఒక్కటి ఇచ్చుకున్నాడు. దెబ్బకు దిమ్మ తిరిగి కిందపడింది నక్క. స్వామీజీ వెంట వచ్చిందని తెలుసు గనక, దాన్ని స్వామీజీ దగ్గరకు

తీసుకెళ్ళారు వాళ్ళు. కొద్దిసేపటికి కళ్ళు తెరచిన నక్క స్వామీజీని చూసి తలదించుకుంది.

"జంబుకవర్ధనా! నువ్వు చూస్తూండగా నేను రక్షించిన ఎద్దు, పాప, తొండ అనవసరంగా మానవుల చేత బాధించబడ్డవి. ఇక నువ్వు చూసిన చేపలు, కప్ప, కోడిపిల్ల అవసరం కొద్దీ వేరే జంతువులకు ఆహారమైనవి. ఎద్దులను, పిల్లలను, తొండలను హింసించకుండా మానవులు జీవించగలరు. కానీ మాంసాహారాన్ని వదిలి కొంగలు, పాములు, గ్రద్దలు బ్రతకలేవు. అది వాటికి సహజమూ, సాత్మ్యమూ అయిన ఆహారం. చక్కగా జీవించే క్రమంలో ఏ ప్రాణీ తన సహజత్వాన్ని కోల్పోనవసరం లేదు- నువ్వు నా దగ్గరకు వచ్చినప్పుడే చెప్పాను- సహజంగా మాంసాహారివి అయిన నువ్వు ఆకులు, అలములు, దుంపలు తినలేవని. ప్రతి ప్రాణీ తనకు సహజమైన ఆహారాన్నే తినాలి- అది జీవహింసకాదు- అలా తినకపోవటమే అసహజం అవుతుంది. ఇప్పటికైనా నువ్వు నీ అడవికి తిరిగి పో! నీకు నచ్చిన ఆహారం తింటూ సహజంగా జీవించేందుకు ప్రయత్నించు" అని చెప్పారు స్వామీజీ.

జంబుకవర్ధనుడికి జ్ఞానోదయమైంది. సిగ్గు పడుతూ తన అడవికి వెళ్ళిపోయింది.

ఇంటిముందు బీగాలు
వేసేవారేగాని తీసేవారు లేరు!
ఎవరది?
జవాబు: ముగ్గు!

తెల్లని గుడి-
లోనికి వెళ్ళే దారి లేదు!
ఏమా కథ?
జవాబు: గ్రుడ్డు!

రెండు స్తంభాల మీద తొట్టి
తొట్టి మీద గుండ్రాయి
గుండ్రాయి మీద గడ్డి
గడ్డిమీద రోడ్డు!
ఏంటి ఇది?
జవాబు మనిషి!

*-C.గిరీష్, 7వ తరగతి, గుండువారిపల్లి ZPHS.*



# సంగీతము వలన...

*రచన: మండువ రాధ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీస్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

సుబ్బయ్యశెట్టికి మంగాపురంలో పెద్ద సరుకుల దుకాణం ఉంది. ఆ ఊళ్ళో అదే పెద్ద అంగడి. చాలా ఏళ్ళ నుంచి ఉన్నది కూడా అదే. అయితే ఈ మధ్య ఆ ఊళ్ళో కొత్త కొత్త అంగళ్ళు చాలా వెలవడంతో సుబ్బయ్యశెట్టి వ్యాపారం కాస్త తగ్గుముఖం పట్టింది.

ఆ ఊళ్ళోనే ఉండే సంగీతం మాస్టారు రామశాస్త్రి, ఏదో కొనాలని సుబ్బయ్యశెట్టి కొట్టుకు వచ్చాడు ఒకరోజున- అప్పుడే పిల్లలకు తరగతిలో చెప్పిన పాటను పాడుకుంటూ. శెట్టికి ఆ పాట చాలా నచ్చింది. "భలే ఉంది సార్, పాట! ఏదీ పాడండి, మరోసారి!" అన్నాడు.

ఆ రోజెందుకో ఉత్సాహంగా ఉన్న రామశాస్త్రి పాటలు అందుకున్నాడు. వచ్చే పోయే జనం ఆ పాటలు విని సుబ్బయ్య శెట్టి కొట్టు దగ్గర ఆగారు. ఎలాగూ కొట్టుదాకా వచ్చాం కదా అని ఎవరికి వాళ్ళు తమకు కావలసిన వస్తువులు ఒకటో రెండో కొనుక్కుని వెళ్ళారు. ఆ రోజు సుబ్బయ్య శెట్టికి బేరం బాగా జరిగింది.

ఇదేదో బాగుందనుకున్న శెట్టికి ఒక ఉపాయం

తోచింది: 'రామశాస్త్రి దగ్గర తన భార్యకి సంగీతం నేర్పిస్తే..?! తను రోజూ కొట్లో కూర్చుని పాడుతుంది; జనం వినడానికి వస్తారు; బేరం జరుగుతుంది!'



అయితే శెట్టి భార్య సుబ్బలక్ష్మికి సంగీతం అంటే ఇష్టమూ లేదు; తన గొంతుమీద తనకి నమ్మకమూ లేదు. అయినా భర్త పోరు పెట్టేసరికి "సరేలెండి. అయినా ముందు నాకు సంగీతం నేర్పించడానికి ఆ రామశాస్త్రిని ఒప్పించండి మరి" అనేసింది. 'ఆయన ఒప్పుకోకపోతే ఆ సంగీతం నేర్చుకునే బాధ తప్పుతుంది కదా' అనుకుంటూ.

భార్యకి సంగీతం నేర్పించమని రామశాస్త్రిని అడిగాడు శెట్టి. "నాకెలా కుదురుతుందీ? పిల్లలకి నేర్పించడానికే సమయం లేదు!" అన్నాడు రామశాస్త్రి.

"బాబ్బాబు! మీకు ఎక్కువ ఫీజు ఇచ్చుకుంటాను. ఎలాగైనా ఇంటికొచ్చి సంగీతం నేర్పించండి" అన్నాడు శెట్టి- "సంగీతం నేర్పించేటపుడు కూడా అందరూ వినడానికి వస్తారుకదా, అట్లా కూడా బేరం జరుగుతుంది కదా!" అని మనసులోనే లెక్కలు వేసుకుంటూ.

ఎక్కువ ఫీజు అనేటప్పటికి రామశాస్త్రి ఒప్పుకున్నాడు. పాఠం మొదలుపెట్టిన రోజే ఆయనకు పరిస్థితి అర్థం అయింది - 'సుబ్బలక్ష్మికి బొత్తిగా సంగీత జ్ఞానమూ లేదు; నేర్చుకుందామన్న ఇష్టమూ లేదు' అని. అయినా ఫీజు పోగొట్టుకోవడం ఇష్టం లేక "సాధన చేయాలమ్మా! ఇంకా సాధన చేయాలి" అంటూ ఒక్కో పాఠాన్ని చెప్పసాగాడాయన.

ఆ పాఠాలు ఊరికే పోలేదు. "సరిగమా" అని అరుస్తూ, కూతలు వేస్తూ, అపస్వరాలతో ఘోరంగా సాధన చేస్తున్న సుబ్బలక్ష్మి గొంతు వింటూనే పారిపోవటం మొదలుపెట్టారు జనం.



మామూలుగా వచ్చే ఒకటి రెండు బేరాలు కూడా రావడం మానేశాయి శెట్టికి.

మరి ఆమె గొంతు స్థాయి కూడా కొంచెం ఎక్కువేనేమో, శెట్టికి చెవులు దిబ్బెడ పడటం మొదలయింది.

ఇక భరించలేని శెట్టి రామశాస్త్రిని పిలిచి, నెల జీతం పూర్తిగా ఇచ్చి, పంపించేశాడు.

సాధన చేసుకుంటున్న భార్య దగ్గరికి పళ్ళు గిట్ట కరుచుకుని వచ్చి "ఆపవేయ్! ఆపు. నీ సంగీతం వల్ల నా బేరసారాలు ఉడిగాయి; నా చెవులు దిబ్బలు పడ్డాయి" అని మండిపడ్డాడు.

సంగీతపు రుచి తెలిసిన సుబ్బలక్ష్మి తన పాటని ఇక ఆపలేదు- భర్త మాటలను పట్టించుకోకుండా 'సరిగమపా' అనటం మొదలుపెట్టింది!

లబోదిబోమన్నాడు శెట్టి.

జీడివారి కోడలు
వేడి వారి మరదలు
వైశాఖమాసంలో ఇంటికి తిరిగి వస్తుంది.
ఏంటది?
జవాబు: మామిడి పండు!

పొడుపు!

చాచుకొని చావిట్లో పడుకుంటుంది;
ముడుచుకొని మూలన నక్కుతుంది-
ఏంటది? జవాబు: చాప!



# ఆకలి పిట్ట

నేపాలీ జానపద కథ

*తెలుగు స్వేచ్ఛానువాదం: నారాయణ, కొత్తపల్లి.*

హిమాలయాల క్రింది భాగంలోనే, అడవికి దగ్గర్లో చిన్న ఇల్లు ఒకటి ఉండేది. ఆ ఇంట్లో నివసించే సుమిత్ర, మోహన్ ఇద్దరూ చాలా మంచివాళ్ళు. ఇద్దరూ ముసలివాళ్లయితే అయ్యారుగానీ, పిల్లలు లేకపోవటంతో, 'రంగ రంగా' అని, ఇంట్లో వాళ్ళిద్దరే ఉండేవాళ్ళు. వాళ్లను చూసినవాళ్ళంతా తప్పక గుర్తించే సంగతి ఒకటుంది- సుమిత్ర చాలా- చాలా- చాలా లావుగా ఉండేది; మోహన్ చాలా- చాలా- చాలా బక్కగా ఉండేవాడు. ఏమంటే సుమిత్ర మామూలుకంటే మూడింతల ఆహారం తినేది. మోహన్‌కు మామూలు ఆహారంలో మూడోవంతే దొరికేది. "ఎందుకోనండీ! చిన్నప్పటినుండీ నాకు మూడింతల ఆకలి!" అనేది సుమిత్ర, మరో రొట్టెకు దట్టంగా వెన్నె రాసుకుంటూ. మోహన్ మాత్రం ఏమీ బదులిచ్చేవాడు కాదు- ఎప్పుడూ "నాకు ఇంకా ఇంత ఆహారం ఎట్లా

దొరుకుతుందా" అని వెతుక్కోవటంలోనే అతని బతుకు తెల్లారుతుండేది మరి.



అట్లా అర్థాకలితో ఉండీ ఉండీ చివరికి మోహన్‌కి ఓ అద్భుతమైన ఆలోచన తట్టింది. ఆ రోజు అడవిలోంచి వస్తూ వస్తూ ఒక రంగురంగుల పిట్టను పట్టుకొచ్చాడు ఇంటికి- "సుమిత్రా! సుమిత్రా! చూడు, నేనేం తీసుకొచ్చానో!" అరిచాడు బయటినుండే.

ఉత్సాహంగా పరుగెత్తుకొచ్చిన సుమిత్ర మోహన్ చేతిలో ఉన్న పిట్టను చూడగానే నిరాశగా మొహంపెట్టింది.

"ఇంత చిన్న పిట్టకే అంతలేసి అరుపా? దీన్ని వండితే మనిద్దరికీ ఓ పంటికిందికి కూడా రాదు! హు" అని మొహం మిటకరించుకుంటూ వెనుదిరిగిందిఆమె!

"హేయ్! ఓయ్! దగ్గరగా చూడు సుమిత్రా! నీకు అర్థం కాలేదల్లే ఉంది- ఇది ఓ అద్భుతమైన పక్షి- బంగారు గుడ్లు పెడుతుంది! త్వరలో మనం ధనవంతులం కాబోతున్నాం!" ఉత్సాహంగా ఆమెను పట్టుకుని గిరగిరా తిప్పాడు మోహన్.

"బంగారు గుడ్లా!?" ఆశ్చర్యంతో సుమిత్ర కళ్లు పెద్దవయ్యాయి.

"అవునోయ్! నిజం బంగారు గుడ్లు! ఏమంటే ముందుగా మనం దీనికి చాలా గొప్ప ఆహారం పెట్టాల్సి ఉంటూంది. అంత మంచి ఆహారం పెట్టలేని పక్షంలో అసలిప్పుడే దీన్ని అమ్మేస్తే మేలు!" అన్నాడు మోహన్ పక్షిని ప్రేమగా నిమురుతూ.

"లేదులే, అట్లా ఎందుకు అనుకోవాలి?! దీన్ని మనమే పెంచుదాం! మంచి మంచి ఆహారం మనం మాత్రం ఎందుకు పెట్టలేం దానికి?" అన్నది సుమిత్ర, దాన్ని నిమిరేందుకు తనూ చెయ్యిచాపుతూ.

"మనం దీన్ని అమ్మకూడదు. మన అదృష్టమే ఈ రూపంలో మనింటికి వచ్చింది- దాన్ని మనం కాలదన్నుకునేది ఎందుకు? ఆగండి- నేను క్షణాల్లో వంట చేసి తెస్తాను. వేడి వేడిగా పూరీలూ, పాలూ, రొట్టెలూ, పాయసం... ఎంతసేపు పని?!" అంటూ గబగబా వంట మొదలు పెట్టేందుకు వంట ఇంట్లోకి పరుగు పెట్టింది సుమిత్ర.



"పక్షిని ఇంట్లో పెట్టుకోకూడదు" అంటూ ఇంటికి ఎదురుగా ఉన్న రావిచెట్టువైపుకు దారి తీశాడు మోహన్. ఆ రావిచెట్టుకో పెద్ద తొర్ర ఉన్నది. అందులో ఉంచితే పిట్ట భద్రంగా ఉంటుంది. "ఈ పిట్టలు గుడ్లు పెట్టే ముందు కనీసం రెండు నెలలైనా నర పురుగు కంట పడకూడదు. మనమూ నర పురుగుల-మేగా?!" అంటూ పిట్టను ఆ గూట్లో పెట్టాడు. "నువ్వు రోజూ దీనికి ఏం పెడతావో నీ ఇష్టం- రెండు నెలలపాటు ఈ పక్షి ఎవరి కంటా పడకుండా చూసుకునే బాధ్యత నీదే! కొన్నాళ్ళ తర్వాత ఈ పక్షి బంగారు గుడ్లు పెడుతుంది. అప్పటివరకూ మనం ఆ తొర్రలోకి తొంగి కూడా చూసేందుకు వీలవ్వదు-" అని చెప్పాడు మోహన్.

ఆనాటినుండీ సుమిత్ర రోజూ రకరకాల రుచికరమైన పిండి వంటలు చెయ్యడం మొదలుపెట్టింది. పూరీలూ, పాయసం, పెరుగూ, పళ్లు- అన్నింటినీ వేటికవి వేరు వేరుగా ఓ బుట్టలో సర్ది, దాన్ని చెట్టు తొర్రలో వదిలి వస్తోంది. ఓ గంట తర్వాత వెళ్ళి చూస్తే ఖాళీ తట్ట ఉండేది అక్కడ. ఏ రోజైనా, పక్షి ఎంత ఎక్కువ అహారం తింటే సుమిత్రకు అంత ఎక్కువ సంతోషం కలిగేది- ఆ పిట్ట ఎన్నెన్ని బంగారుగుడ్లు పెట్టనున్నదో తలచుకొని తలచుకొని మురిసిపోయేదామె.

కాలం గడిచేకొద్దీ మోహన్ లావెక్కడం

మొదలుపెట్టాడు. అయితే సుమిత్ర పక్షి కోసం రోజూ ఎంతెంత ఆహారాన్ని పొదుపు చేస్తోందంటే, ఆమె ఇప్పుడు బాగా చిక్కిపోయింది. ఒకటి- రెండు నెలలు గడిచేసరికి ఆమె తన భర్త లావెక్కటాన్ని గమనించింది; కొంచెం కొంచెంగా అనుమానించటం మొదలెట్టింది-



చివరికి ఇక తట్టుకోలేక, ఒక రోజున పక్షికోసం బుట్టనిండుగా అహారాన్ని తెచ్చి ఇచ్చాక, తొర్ర బయట దగ్గర్లోని ఓ పెద్ద బండరాయి వెనుక నక్కి కూర్చున్నది ఆమె. పది నిముషాల సమయం గడిచిందో లేదో- మోహన్ తొర్ర దగ్గర ప్రత్యక్షం అయ్యాడు- తొర్రలోంచి బుట్టను బయటికి తీసి, అందులోని ఆహారాన్ని ఆచిగా మెక్కటం మొదలుపెట్టాడు!

సుమిత్ర నిర్ఘాంత పోయింది! తన కళ్ళని తానే నమ్మలేకపోయింది! తను మోసపోయిన సంగతి ఆమెకు ఆ క్షణంలోనే అర్థమైపోయింది. బంగారు గుడ్లు అంటూ లేవు- అవి తనకు ఏనాడూ దొరకవు! మర్నాటినుండీ సుమిత్ర తొర్ర దగ్గర ఆహారం పెట్టడం మానేసింది. విచిత్రం, మోహన్ కూడా ఆమెను ఏమీ అడగలేదు- ఎందుకంటే ఆనాటినుండే భోజనాలప్పుడు ఇద్దరికీ సమాన వాటాలు దొరుకుతున్నాయి మరి! చూస్తూండగానే ఇద్దరూ సమానంగా లావెక్కారు. 'చూడముచ్చటైన బొద్దు జంట" అని పేరుతెచ్చుకున్నారు!

నవ్వు!

**అతనికంటే ఘనుడు!**

రాము: నా మిత్రుడు శ్యామును భోజనానికి పిలిచాను; ఇవాళ్ల వస్తాడు. ఆ వెండి గ్లాసు, పళ్ళెం జాగ్రత్త- వాడి కంట పడనివ్వకు!

భార్య: ఏమి, అతనిది అంత దొంగబుద్ధా?

రాము: కాదు. వాడు వాడి వస్తువులను గుర్తుపడితే కష్టం కదా, అందుకని!

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ఎండాకాలం, పిల్లవాడు, కోడిపుంజు, పావురం, వ్యాపారం, మనోబలం, తుఫాను, వాయుగుండం, తెలంగాణ, ఎన్నికలు, తెలుగుబాల, బాలసాహిత్యం, పులి, చందమామ, కొంగరాజు, ఖజానా, పుస్తకం, రచయిత, పరీక్ష, బంగారం-** ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాక్కొని ఉన్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బం | కో | ఎం | కం | ర | స్త | బా | యి | త | గ | క్ష | పి |
| గా | డి | వ్యా | స్త | తె | బం | ఖ | ల | కొం | యి | ల్ల | జా |
| ర | పుం | పా | పు | లం | కా | డా | ఎం | సా | వా | చ | ణ |
| తె | జు | యి | వు | ఎం | బ | వ్యా | క్ష | డు | హి | పు | ర |
| క్ష | పు | వా | డం | రం | ఖ | నో | బం | ను | వా | త్యం | ఖ |
| బా | రీ | గుం | కొం | పా | ర | ఎం | మ | గా | ఫా | వా | క్ష |
| ల | యు | ప | గ | వ్యా | నా | జా | ఖ | స్త | న్ని | తు | లా |
| వా | తె | ఎ | వా | యి | వ్య | తె | లం | గా | ణ | బా | ణ |
| స్త | లు | రం | న్ని | మ | ఖ | జా | కొం | వు | వ్యా | డా | స్త |
| పు | గా | న్ని | మా | క | న్ని | ఫా | పా | గ | ఎం | ణ | లి |
| బం | డం | ద | డి | తె | లు | గు | బా | ల | రా | న్ని | పు |
| గుం | చం | కో | తు | ఫా | ణ | ప | రీ | న్ని | స్త | జు | త్యం |

# పదరంగం-68

*నిర్వహణ: కొత్తపల్లి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | ■ | 3 | 4 | 5 |
| 6 | | 7 | ■ | 8 | |
| | ■ | 9 | 10 | | ■ |
| 11 | | ■ | | ■ | 12 |
| | ■ | 13 | ■ | 14 | |
| 15 | | | | | |

## అడ్డం

1. వేసవి కాలంలో ఉండేది! (2)
3. సొంత లక్షణం! (3)
6. దీనికి పరిష్కారం కావాలి (3)
8. 'రతనాల సీమ'లో మొదటి రెండక్షరాలు (2)
9. నీరాజనం! కర్పూరంతో ఇస్తుంటారు! (3)
11. పువ్వు కాదు! (2)
14. ఇవి ఎక్కువైతే నిలువు 12ను దాటుతై! (2)
15. సాధారణంగా సాంబారులో వేస్తుంటారు (6)

## నిలువు

1. ఎండల కాలం! (6)
2. చేనుకానిది! తిరగబడింది! (2)
4. సరస్వతి. భారతమాత కూడా (3)
5. 'తందానతాన'- అని ఇది పాడతారు! (2)
7. సున్నలేని 'కామెడీ', తిరగబడింది (2)
10. సూర్యుడిని ఇలా కూడా పిలవొచ్చు! (2)
12. రాజుగార్లు రక్షణ కోసం కట్టుకునేవి! (3)
13. దోమ తో పాటు గుర్తొచ్చేది! (2)
14. మ్యాజిక్కు లాంటిదే, కానీ మ్యాజిక్కు కాదు! (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీ వాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-70 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

మంచి పుస్తకం:

## మన పిల్లల పాటలు

(పిల్లల జానపద గేయ సర్వస్వం) -డా.వెలగా వెంకటప్పయ్య

పాటలంటే ఎవరికి ఇష్టం ఉండదు? ఇదివరకు, అమ్మమ్మలు బామ్మలు, తాతయ్యలు ఉన్నప్పుడు, మనవళ్ళకి మనవరాళ్లకి రకరకాల పాటల్ని వినే సౌభాగ్యం కలిగేది. అప్పట్లో తెలుగు పిల్లలందరూ జోలపాటల మీద, 'చందమామ రావే'ల మీదా పెరిగారు. ఇప్పుడు అమ్మానాన్నలు ఇద్దరూ పనుల్లో పూర్తిగా మునిగిపోయి ఉంటున్నారు, కొంచెం తీరిక ఉన్నా వాళ్లకి ఈ పాటలు గుర్తుకే రావట్లేదు!

కొత్తపాటలు కొన్ని వచ్చాయి, అయినా పాతవాటిలో ఉన్నంత బలం కొత్తవాటిలో వెతికితే తప్ప కనబడటం లేదు. అలా మంచి విలువలు వెతుకుతున్న అమ్మానాన్నలకు "మేమందరం ఉన్నాం" అని గుర్తుచేస్తాయి, యీ పుస్తకంలోని మా చక్కని "మన పిల్లల పాటలు".

జోలపాటలు, ఆటల పాటలు, ఎగతాళి పాటలు, వినోదగేయాలు, తొక్కుపలుకులు, అభినయగీతాలు, సంప్రదాయ గీతాలు, సామెతల పొడుపుకథల పాటలు ఎన్నెన్ని గుర్తున్నాయో అన్నీ కనబడ్డాయి ఇందులో! గుర్తులేని వాటికైతే లెక్కే లేదు!

ఇన్నిన్ని పాటల్ని సేకరించి పెట్టిన వెంకటప్పయ్య గారికి వెయ్యి ధన్యవాదాలు!

"మన పిల్లల పాటలు"
డాక్టర్ వెలగా వెంకటప్పయ్య,
తెనాలి.
వెల: 130 రూ,10$.
పెద్దపేజీలు:196
ఫోన్:08644 228585



# ప్రిన్సెస్

ఉర్దూ మూలం: జయంత్ పర్మార్ అనువాదం: మెహజబీన్

నాకూతురు-

నాప్రియమైన కూతురు- షార్పెనర్ తో ఫ్రెండ్షిప్ చేసుకున్నది

ఆకాశంలాంటి తెల్లని కాగితాన్ని ఆమె పెన్సిల్ తో వెలిగిస్తుంది

ఆమె కాగితాకాశంనిండా వెలుగులు పంచుతుంటుంది

ఆమె ఊహలు తెల్లని కాగితాకాశం మీద చిత్రాలై పరుగులు పెడతాయి

చెట్టును ఎగరేసుకెళ్తున్న నల నల్లని పక్షులు-

కళ్ల జోడు పెట్టుకున్న నెమలి-

ఆకాశంలో ఎగురుతున్న అగ్నిమాపక రథం-

నేలమీద నడుస్తున్న విమానం-

ఆవుతో మాట్లాడుతున్న పులి-

చెట్టు మాటున దాగిన ఒంటికన్ను సూరీడు-

దాని మీద కమ్ముకున్న నల్లమబ్బు తునక-

మబ్బుల్లో ఎగురుతున్న నీలిరంగు చేపపిల్ల-

జలపాతం అలలమీద తేలుతూ పసుపు పచ్చని సీతాకోక చిలుక..

నాప్రియమైన కూతురు ఇష్టంగా ఎన్నెన్ని చిత్రాలు వేసిందో చూడండి!

కానీ స్కూల్లో టీచర్ హోంవర్క్ ఇస్తే మాత్రం

నా బంగారు బొమ్మకు కోపం వస్తుంది

ఆ కోపంలో ఆమె పెన్సిల్ మొన విరగ్గొడుతుంది

ఆమె కాగితాకాశంమీద అప్పటిదాకా వెలిగిన పెన్సిల్ కొవ్వొత్తి ఆరిపోతుంది

తెల్లని కాగితాకాశాన్ని నల్లని పొగ కమ్ముకుంటుంది.

Published by NarayanaSarma for Kottapalli Prachuranalu,1-127/A, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offset Printers, Vijayawada,Phone:08662579129